[illegible]



# గాలిబ్ గీతాలు

దాశరథి

చిత్రాలు

బాపు



ఎం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం మద్రాసు సికింద్రాబాద్

# PREFACE

*by*

**Dr. B. GOPALA REDDI,**

*President, Andhra Pradesh Sahitya Akademi*

Mirza Ghalib is attaining greater fame as days pass by. *Perhaps he is better known today than about 30 or 40 years ago.* A number of criticisms have come on his poetry and naturally they have stimulated greater interest in his work. His works in Nagari Script in recent years have brought an additional number of admirers, the film and the radio have popularised his Gazals and the sum total of all this is a larger clientele of readers who are *trying to appreciate Ghalib's poetry.*

Mirza Ghalib is acclaimed as the greatest of the Urdu poets, the other two in the Trinity could be Mir and Iqbal. People who are well versed in English poetry and scholars who are steeped in oriental learning like Arabic, Persian and Sanskrit, equally admire Ghalib's poetry. There is a rare charm in his similes and a grace in his expression. There are contexts where great philosophical truths are expressed in beautiful poetic language. At times he is very difficult both in thought and language and at times his language is very easy with popularly understood idioms and expressions used by common people.

In Urdu poetry we come across a new atmosphere both in the style of expression and the subject matter of the poetry. In Gazals it is usually the love theme, the lover pining for the beloved in utter despair. The beloved is tyrannical, hard-hearted, never keeping to promises and occasionally is picturised as the killer of the lover with sword in hand, piercing him with arrows shooting from the corners of her eyes. The Gul and the Bul Bul, the Shama and Parwana, the Burq and the Nasheman (the thunder and the nest), the Jam (cup) and the Saqi and the Badah and the Mykhana and the Theer-e-nazar and their synonyms haunt you at every turn. All told the subjective reactions of love are the main theme of Urdu poetry. They avoid

mere descriptions but one's own experiences or reactions under the impact of love find expressions and the whole idea must be complete in a Couplet. There is a newness in the style and the atmosphere which Urdu poetry creates. There is no gainsaying of the fact that there is great wealth of culture in Urdu and specially in poetry and it behoves cultured Indians to preserve what has been bequeathed to us and surely Ghalib shines like Venus on the firmament of the Urdu poetry.

Dasarathi, though young in age has already made a mark for himself among the modern poets of Andhra Pradesh. He is a well-known literary figure; he is modern, with roots in classical tradition. He is a student of Sanskrit literature, he is familiar with English poetry and has enjoyed the fresh morning breeze of the garden of Urdu poetry. Needless to say he drew inspiration from the classical Telugu poets. With this background and with his great admiration for the greatest of the Urdu poets, he has translated into Telugu verses over 400 Couplets of Mirza Ghalib's poetry. I had occasion to listen to some of his recitations of these poems and I was greatly impressed by the manner in which he brought out the nuances and the elegance of the Urdu poetry into idiomatic Telugu. They read very well indeed in Telugu verse and I am sure the Telugu public would feel thankful to Dasarathi for his translation.

Omar Khayam has been translated by many modern poets of Telugu literature like late Shri Duvvuri Rami Reddi and Prof. Rayaprolu Subba Rao and this is the first attempt for any translation of Ghalib into Telugu. By the time the country celebrates Ghalib's death centenary in 1966, I am sure Telugu public also will be familiar with Ghalib's poetry by such translations which will be available to the Telugu lovers of poetry. Shri Dasarathi is eminently suited to undertake a difficult task like this and he has done it with commendable originality. It will be a welcome addition to the modern translations and I am hopeful it will stimulate greater interest in Urdu poetry.

# మిర్జా అసదుల్లా ఖాన్ గాలిబ్

జననం :

27, డిసెంబరు 1797



మరణం :

15, ఫిబ్రవరి 1869

మున్నది. శ్రీ దాశరథి ద్వారా ఈ పని జరుగుట వలన బంగారమునకు పరిమళమబ్బినది.

ఉర్దూ సాహితీ ప్రపంచమునకు గాలిబ్ కవీశ్వరుడు సూర్యుని వంటి వాడు; ఉర్దూ సారస్వతమున గాలిబ్ మహాకవిది ఉన్నతోన్నతమైన స్థానమని సాహిత్య చరిత్రకారులు, విమర్శకులు ఏకకంఠముగా అంగీకరించు చున్నారు. మన శ్రీనాథుని వలె గాలిబ్ విద్వాంసుడైన కవిసార్వభౌముడు. కొంచెము పరిశీలించినచో ఈ యుభయుల యందు కొన్ని పోలికలు గూడ గోచరించగలవు. శ్రీనాథునివలె గాలిబ్ కూడ భోగములయందు ఆసక్తిని, ప్రీతిని కలిగి, వానిని నిర్భయముగా ప్రకటించిన స్వైర విహారధీరుడు; స్వతంత్రుడు. కావుననే, ఈ యిద్దరి రచనలయందు శక్తిమంతము, ప్రతిభావంతము నగు వ్యక్తిత్వము అడుగడుగున ప్రత్యక్షమగుచుండును. చరమ దశలో అనేక కష్టాల పాలైనప్పటికిని, శ్రీనాథుడు తన జీవితములోని అత్యధిక భాగమును రాజాశ్రయమునందు గడపి, తాను కాంక్షించిన సమస్త భోగములను పొంది, అనుభవించుటలో కృతార్థుడయ్యెను. కాని ఇందుకు విరుద్ధముగా, రాజాశ్రయము సంపాదించి, భోగకాంక్షలను నెరవేర్చుకొనవలెనని యెంతో ఉత్కంఠ కలిగి యుండినప్పటికిని, అందుకొరకు ఎంత ప్రయత్నము గావించినప్పటికిని, గాలిబ్ మాత్రము కృతార్థుడు కాలేదు. కావున శ్రీనాథుని చరమదశ విషాదాంతమైనట్లుగా, గాలిబ్ జీవితమంతయును విషాదగాథ యైనది. శ్రీనాథుని భావప్రౌఢిమ, వైదుష్యము, భావగాంభీర్యము గాలిబ్ రచనలలో కూడ ప్రస్ఫుటముగా కనుపించుచుండును.

విలాసములందు ఎంత అనురక్తుడైనప్పటికిని, విషాద జీవితమునే గడుపవలసి వచ్చిన గాలిబ్ మహాకవి మరొక విధముగా చాల అదృష్టవంతుడని చెప్పవలసి యున్నది. (ఈ యదృష్టము శ్రీనాథునికి లభించలేదు.) అందరు కవులకు వలెనే, గాలిబ్ మహాకవికి గూడ సమకాలికుల మెప్పు సంపూర్ణముగా లభించక పోయినప్పటికిని, కాలానంతరము ఉర్దూ కవులందరిలో సర్వోత్కృష్టమైన అగ్రగణ్యత అతనికి లభించినది. గాలిబ్ రచనలకు "చొగ్తాయి" వంటి ఉత్తమ చిత్రకారుని చేత ప్రతిభావంతమైన వ్యాఖ్యానము గావించినది. "ఎఖ్బాల్" మొదలైన మహాకవుల రచనలకు గూడ "చొగ్తాయి" చిత్రరూపము కల్పించినాడు. కాని గాలిబ్ కవిత్వమునకు వ్రాసిన చిత్రములే అన్నిటికన్న ఎక్కువ ఖ్యాతిని పొందినవి. బహుశా ఈ చిత్రకారుడు గాలిబ్ వంటి చిత్తవృత్తి కలిగిన ప్రతిభావంతుడైనందు వలన కాబోలు, గాలిబ్ కవిత్వమునకు సంబంధించిన చిత్రాలు సర్వోత్కృష్టమైనవిగా కీర్తిగాంచినవి. సైగల్ వంటి గొప్ప గాయకుడు గాలిబ్ గీతాలను గానము చేసి, ఉర్దూ భాషాప్రియులకు హృదయాహ్లాదకరమైన వినులవిందు

గావించినాడు. గాలిబ్ జీవిత చరిత్రను వ్రాయుటకు హాలీ వంటి గొప్ప పండితుడు, ఉత్తమ రచయిత లభించినాడు. హాలీ రచించిన గాలిబ్ జీవిత చరిత్ర ఉర్దూ వాఙ్మయములో గొప్ప రచన. ఈ విధముగా చిత్రకారుడు, గాయకుడు, చరిత్రకారుడు—ముగ్గురు గాలిబ్ కవీంద్రుని అజరామరుని గావించినారు.

గాలిబ్ వ్యక్తిత్వము సర్వవిధాల విశిష్టమైనది; ఆచార విచారము లందు, ఆహార విహారములందును ఈ విశిష్టత గోచరించుచుండును. గాలిబ్ శైలిని సమకాలి కవులు కొందరు అనుకరించుటకు ప్రయత్నించి విఫలురైన సత్యమిందుకు నిదర్శనము. గాలిబ్ కవితను పరిశీలించినప్పుడు ఆయన తన వ్యక్తిత్వమునకు అత్యంత ప్రాధాన్యము నిచ్చినట్లు స్పష్టము కాగలదు. ప్రేమ కవిత్వము వ్రాసిన ఉర్దూ కవీశ్వరులది సాధారణ స్త్రీదృక్పథము; కాని గాలిబ్ కవీశ్వరునిది మాత్రము పురుషదృక్పథము. గాలిబ్ లో 'అహం' చాల యున్నది; ఆయన ప్రత్యేకతకు ప్రధాన కారణములలో ఇది యొకటి. ఈ ప్రత్యేకతకు గాలిబ్ రచనలన్నియును ఉదాహరణములే.

ఉర్దూ భాషలో 'గజల్' సుప్రసిద్ధమైనది. ఉర్దూ కవులలో అనేకులు ఈ పద్ధతినే అనుసరించినారు. గాలిబ్ 'గజల్' రీతిలోనే గాక ఇతర రీతులలో గూడ రచనలు అల్లినప్పటికిని, గజల్ రీతికి గాలిబ్ సార్వభౌముడై, ఈ మార్గమున ఇతరులను మించి అగ్రగణ్యుడైనాడు. గజల్ కవితా రీతిని అనుసరించిన ఉర్దూ కవులు రెండు విషయాలకు మాత్రమే హెచ్చు ప్రాధాన్యము నిచ్చినారు. మొదటిది ప్రేమ; రెండవది సూఫీతత్త్వము. కాని వీరందరి వలెగాక గాలిబ్, మానవ జీవితమును సమగ్రముగా తన కావ్య దర్పణమున ప్రతిఫలింప జేసినాడు. జీవితమును, దాని భిన్న దృక్పథములను చిత్రించిన మొట్టమొదటి ఉర్దూ కవి గాలిబే యని చెప్పవచ్చును. జీవిత రంగము, అందలి విలాసము, విషాదము, తీపి, చేదు, మరియు అందలి ఒడుదుడుకులు గాలిబ్ తన 'గజల్' కవిత్వములో ప్రదర్శించి, ఉర్దూ కవులలో అద్వితీయమైన స్థానము నాక్రమించినాడు.

గాలిబ్ కవి మాత్రమే కాదు; గొప్ప వచనరచయిత గూడ. ఉత్తమ వచనమును వ్రాయవలెనని ఆయన ఉద్దేశించలేదు. తనకు మిత్రులు, ఆప్తులు, శిష్యులు నైనవారికి వ్రాసిన లేఖా పరంపరలో గాలిబ్ వచన శైలిని మనము రుచిచూచుచున్నాము. ఈ లేఖా పరంపరలోని శైలి తరువాత ఉర్దూ వాఙ్మయములో నూతన యుగానికి దారి తీయగలదని కాని, అధునిక ఉర్దూ వచన వాఙ్మయానికి ఆదర్శ పాత్రము కాగలదని కాని ఆనాడు గాలిబ్ భావించి యుండలేదు. ఉర్దూ భాషలో ఉత్తమ వచన రచయితలుగా ప్రఖ్యాతికెక్కిన హాలీ, షిబ్లీ, సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్, నజీర్ అహ్మద్ ప్రభృతు

ఫిట్జుజెరాల్డువలె, దాశరథి గాలిబ్ కవిత్వమును హృద్గతము గావించుకొని అనన్య సాధ్యమైనరీతిని ఆంధ్రీకరించినాడు. మూలమునకు అనువాదము ఇంత సన్నిహితముగా నుండుట కడు కష్టసాధ్యము. ఈ అనువాదము కడు సరసముగా సాగినది. పూర్వజన్మలో దాశరథియే గాలిబేమో! లేక ఈ జన్మలో గాలిబే దాశరథిగా అవతరించెనేమో!

ఉరుదూ కవులలో ఎవరును తమ రచనలలోని భాగాలను ఏరి కూర్చి ప్రకటించి యుండలేదు. కాని గాలిబ్ మాత్రము ఆ పనిని గావించినాడు. తన జీవితకాలములో స్వయముగా తానే యేరికూర్చి ప్రకటించిన కావ్యభాగములు వాస్తవముగా ఆతని కవిత్వములో ఉత్తమోత్తమమైనవి. ఈ గ్రంథము దాశరథికి ఎంతవరకు ఉపయోగించినదో తెలియదు. ఎందుకనగా ఆ సంపుటపు ప్రతులు ఈనాడు లభ్యమగుట లేదు. గాలిబ్ గజల్‌ను ఒక్కొకదానిని తీసికొని ఆమూలాగ్రముగా దాశరథి అనువదించలేదు. గజల్‌లో కొన్ని 'షేర్' లను తీసుకొని ఆంధ్రీకరించినాడు. ఈ పద్ధతి మిక్కిలి ఔచిత్యవంతముగా, సరసముగా నున్నది. గాలిబ్ గజల్లోని ఉత్తమ విభాగములను ఎన్నుకొనుటలో దాశరథి కవితా హృదయము, మరియుం ప్రతిభ ప్రతిబింబించుచున్నవి.

దాశరథి యేరి కూర్చిన ఈ ఖండకృతులలో గాలిబ్ కవి ప్రేమార్ద్ర హృదయము తొంగి చూచుచున్నది. గాలిబ్ ప్రేయసి ఒకమారు ప్రసన్నురాలు; మరియొకమారు పరాఙ్ముఖురాలు. 'క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్' అన్నట్లుగా నున్నది ఆమెకథ. ఆమెకు గాలిబ్ ఏకైక ప్రియుడు కాడు. ఆ పద్మము మీద మరికొన్ని భృంగములు ఝుంకరించుచున్నవి. కాని గాలిబ్ క్రోధపూరితుడు కాలేదు. ఆయన ప్రేమ అవంతయును తగ్గలేదు. ఇది నిరుపమానమైన ఘటన—

''ఒరుల కొసగ లేదె ఉవిద! నీ యధరమ్ము?
నాకు గూడ నోరు లేక పోదు''

అనియును :

''ఉవిద గోష్ఠిలో నే నుండకుంట మేలు,
నన్ను గూర్చిన ప్రస్తావనమ్మె చాలు''

అనియును గాలిబ్ తన హృదయమును ప్రకటించి యున్నాడు. కడకు :

''నాడు చిన్నికూడు, నా జీవితపు గోడు,
నా విషాద గాథ నాదె కాదె!''

అని ఆవేదన చెందినాడు. నిజముగా గాలిబ్ జీవితము విషాద గాథ. గాలిబ్ ప్రేమ స్వార్థరహితమైనది.

“నాకు నిష్కామ కర్మ యెంతయు ప్రియమ్ము” అని ఆయనయే స్వయముగా చెప్పుకొనినాడు. ఆయన ప్రతిపాదించిన ప్రేమ సిద్ధాంత మేమో ఇది! ఒకమారు ప్రమోదము, మరొకమారు విషాదము; ఒకసారి ఆశ, ఇంకొకమారు నిరాశ; వేరొక పర్యాయము వేదాంతము గాలిబ్ ప్రేమోపాసనలో గోచరించుచున్నవి. ఈ ప్రేమ తరంగములన్నియు ఈ కావ్యమున చక్కగా కనుపించుచున్నవి.

మానవ జీవితమును ప్రతిబింబించు గీతములున్నను, ఎక్కువగా ప్రేయసికి, ప్రేమకు సంబంధించినవే ఈ కావ్యసంపుటములో అనువదింపబడినవి. గాలిబ్ కవిత్వములో మానవ జీవితము సమగ్రముగా ప్రదర్శితమైనదని చెప్పుటకే మనవిచేసినాను. కావున ఆయా భాగాలను కూడా మరికొంత విపులముగా మరొక సంపుటముగా అనువదించి ప్రకటించుట సమంజసముగా నుండగలదు. అప్పుడే గాలిబ్ కవిత్వము, వ్యక్తిత్వము తెలుగు సీమకు సంపూర్ణముగా లభించగలదు. ఈ సంపుటము కూడ త్వరలో శ్రీ దాశరథి ప్రకటింపగలడని ఆశించుచున్నాను. ఈ “గాలిబ్ గీతాలు” ప్రకటించిన యం. శేషాచలం అండ్ కో వారిని హృదయపూర్వకముగా అభినందించుచున్నాను. ఈ కావ్యమునకు మనోహరమైన చిత్రములను కూర్చిన శ్రీ ‘బాపు’ కృషి ప్రశంసనీయమైనది.

క్రొత్త ఢిల్లీ
18-2-1961

— దేవులపల్లి రామానుజరావు

# అంకితం

ఆప్తమిత్రులు, అస్ఖలిత హృదయులు, అశేష ప్రజ్ఞాశాలి

నటశిఖామణి

## శ్రీ అక్కినేని నాగేశ్వర రావు గారికి

మైత్రి యనెడి దివ్య సూత్రమ్ము బంధించె
నిన్ను నన్ను, మిన్ను మన్ను పోలె.

తారకా పథాల దనరు నీ చేయూత
ధరణి పైని నాకు దొరుక జాలె.

విషమును భుజించి నవ సుధా చషక మిడిన
విశ్వ రక్షకుడైన నాగేశ్వరుడవు.
నశ్వరంబైన ఈ మహా విశ్వమందు
నలుగురికి మేలు సేయు అనశ్వరుడవు.

కలుష పంకమ్ము తనరు లోకమ్మునందు
విమల పద్మమ్ము పోలిక వెలసినావు.

అజ్ఞతా గాఢ తమసమ్ము నవల ద్రోయు
జ్ఞాన దీపమ్ము వెలిగించ జాలినావు.
ద్వేష పాషాణ కఠిన ధాత్రీ తలాన
స్నేహ సుకుమార కుసుమముల్ నింపినావు.

ధన మదాంధ ధాత్రీ తలమ్మును పవిత్ర
దాన జల ధారలందున తడిపినావు.

గర్వ గహనాటవీ భయంకర కరీంద్రు
నమిత్రాంకుశమున గ్రుచ్చినావు నీవు

కుల మతమ్ముల చీకటి గొలుసులందు
కట్టు బడని విశాల దృక్పథము నీది.

సంకుచిత వర్ణ వర్గ నిస్సార సీమ
లాగ బడబోని నవ మనోరథము నీది.

శారద సరస్సు వంటి నీ స్వచ్ఛ మానసాన
నవ కళా పయోజమ్ములు నాట్య మాడె.

వారిదము వంటి నీ దయా స్వాంతమందు
వితరణ ప్రాదసీ లతల్ విరియ బూసె.

అర్ణవము వంటి నీ హృదయమ్ము నుండి
పూర్ణ మానవతా శశి పొంగి వచ్చె.

పాత్రుడవు, మిత్రవరుడవు, చిత్ర లోక
చక్రవర్తివి, శాశ్వతావక్రకీర్తి!

స్నేహితుల పాలి కల్పవనీరుహంబ!
మన్మనో నందనావనీ మార్గ వర్తి!

మచ్చ లేని పున్నమ చందమామ వీవు,
చిత్రముల దోచు సౌందర్య సీమ వీవు.

కనికరమునకు రత్నాల గనివి నీవు,
స్నేహ మంత్రమ్ము పలుకు రాచిలుక వీవు.

సాంధ్య వేదికపై నటస్వామి వీవు,
పుణ్యకార్యమ్ములకు రంగ భూమి వీవు.

ఇచ్చుటే గాని చేకొంట యెరుగ నట్టి
నీకు కానుకగా నేమియు నీయ జాల.

నీ గళాన సమర్పింప నిమ్ము నన్ను
తొలి గాలిబు గీతాల పూల మాల.

# గాలిబ్ కవితా వైభవం



వేదనలోనుండే కవిత వెలువడుతుందంటారు. కడుపులో చల్లకదల కుండా ప్రశాంతంగా గడిచిపోతుంటే, జీవితం కల్లోలంలేని చిన్ని తటాకంలా నిశ్చలంగా వుంటుంది. కాని గాలిబ్‌వంటి మహాకవుల జీవితాలు మహా సముద్రాలవలె అనుక్షణం క్షోభించి, ఆ క్షోభలోనుండి కవితాశోభను వెలువరించినవి.

గాలిబ్ అట్టివాడూ అతను పలికిన ప్రతిపద్యం హృదయాన్ని పిండి వెలువరించినదే. ఉరదూభాషలోనేగాక అన్యదేశ భాషయైన ఫారసీలోనూ అనన్య సామాన్యమైన ప్రజ్ఞను సంపాదించి ఆభాషలోను చక్కని కవితను వెలువరించినాడు గాలిబ్. గాలిబ్ పద్యరచనలో ఎంత దిట్టయో, వచనం కూడా అంత బాగా వ్రాసి చక్కని వచనరచనా రీతికి ఒరవడి పెట్టినాడు.

గాలిబ్ తన పదకొండవయేటనే ఉరదూలోనూ, ఫారసీభాషలోనూ కవిత చెప్పినాడు. ఉరదూ సాహితీ సామ్రాజ్యంలో కవితా మకుటం ధరించి ఈ నాటికీ ఏకచ్ఛత్రాధిపత్యం నెరపుతున్న మహాకవి గాలిబ్ ప్రతిభ పసినాడే అలా విజృంభించింది. గాలిబ్ సహజకవి. శ్రమపడి కవిత నేర్చినవాడుకాడు.

> ''ఏను స్వాయముగా కవితన్ వరించలేదు,
> తాను వరియించె కైతల రాణి నన్ను''

అని అతడే చెప్పుతున్నాడు. అతను ఫార్సీగజల్ తన పదకొండవ ఏట వ్రాసి అంత్యనియమంలో ''శాచా'' అనే ఒక ప్రయోగం చేశాడు. తన గురువైన షేక్ మొఅజ్జమ్ ఆ పద్యం వినిపించగా అతను విసుక్కొని 'ఇలాంటి అర్థంలేని ప్రయోగాలు ఇక ముందుచేయకు' అన్నాడట. గాలిబ్ మనస్సు అందుకు చాలా నొచ్చింది. తన ప్రయోగం సరియైనదని తనకు నమ్మకా

వుంది. కాని సరియైనదని వాదించే ఓ తీరని పసితనం. కాగా ఒకసారి తాను ప్రయోగించిన రీతినే మల్లాజుహూరీ అనే ఒక కవి రచనలో ఒక ప్రయోగం కనపడింది. ఆ పద్యం తీసుకుని గురువుగారిదగ్గరకు పరుగెత్తాడు. తన ప్రయోగం సరియైనదే అని రుజువు చేశాడు. గాలిబ్ చూపిన ఉదాహరణకు గురువు ఆశ్చర్యపడ్డాడు. హృదయం ఉప్పొంగిపోయింది. “నాయనా! దైవదత్తమైనది నీ కవితాశక్తి. ఎవరి మాటలనూ లెక్క చేయకుండా రచన సాగించు” అన్నాడు.

గాలిబ్ ఎంత ప్రతిభావంతుడో అంత దురదృష్టవంతుడు. ఐదవ యేట తండ్రి గతించాడు. తొమ్మిదవయేట పినతండ్రి గతించాడు. ఇక ఇంటిపెద్ద ఎవరూ లేకపోగా అమ్మమ్మతాతగారింటిలో పెరగవలసి వచ్చింది. తండ్రిలేని పిల్లవాడని అక్కడ అంతా గాలిబ్‌ను చాలా గారాబంగా పెంచారు. ఎట్టి కట్టుబాట్లు లేకుండా స్వేచ్ఛగా పెరిగాడు గాలిబ్. అయినా అతనిలో కవితా రచన సహజసిద్ధంగా ఉప్పొంగి వచ్చింది.

పసితనంలో గాలిబ్ రాసిన కవిత “మీర్ తకీ” అనే కవి మెచ్చాడు. “మీర్ తకీ” అప్పటికే చాలా సుప్రసిద్ధ కవి. అతడన్నాడట— “ఈ అబ్బాయికి సరియైన ఉపాధ్యాయుడు దొరికి సరియైన దారిలో పెడితే గొప్పకవి అవుతాడు” అని. కాని సరియైన ఉపాధ్యాయుడు లేకుండానే గాలిబ్ గొప్ప కవి అయినాడు. స్వయంకృతితోనే పాండిత్యం సంపాదించుకున్నాడు. తనను తాను దిద్దుకున్నాడు. తనను తాను నిర్మించుకున్నాడు. ఆ కాలంలో గురువువద్ద విద్యాభ్యాసం చేయనివానికి గౌరవం ఉండేదికాదు. కనుక తాను “ముల్లా అబ్దుస్సమద్” గారి వద్ద శిష్యత్వం నెరపినట్లు చెప్పుకున్నాడు. నిజానికి అతనివద్ద నేర్చుకుంది అంతంత మాత్రమే.

గాలిబ్ స్వతంత్ర ప్రవృత్తి గలవాడు. ఆలోచనలో దాని అభివ్యక్తీకరణలో, రచనలో అన్నిటిలో స్వతంత్రతను కోరేవాడు గాలిబ్. జనానికి విడ్డూరం అనిపించినా, రూఢిగ్రస్త మార్గానికి భిన్నంగా తోచినా తాను లెక్కచేసేవాడు కాదు. పసితనాన అతను రాసిన ఒకపద్యం చూడండి :

“నాశమునగూడ సౌఖ్యమున్నది గ్రహింప,
విడివడిన గోరు సుఖమును బడయుజేయు”

లోకంలో వినాశనంలో కూడా రుచి, సౌఖ్యం ఉన్నాయి. అది తెలుసుకోకుండా జనం వినాశనాన్ని ద్వేషిస్తారు. గోరూడిపోతే సుఖంగా వుంటుంది. గోరు ఊడడం వినాశనానికి సంకేతం. గోరుపోవడంవల్ల కలిగే హాయి వినాశంలోనూ హాయి ఉన్నది అనే సత్యాన్ని బోధిస్తున్నది అంటు న్నాడు గాలిబ్. మృత్యువులోకూడా రుచి వుందనే భావాన్ని [illegible]

టంతో పోల్చిచెప్పిన గాలిబ్ ఆలోచనారీతి కడు బాల్యంలోనే జనాన్ని చకితులను చేసింది.

“మృత్యువు లేకున్న దుఃఖమనేది బ్రతుకులోనే?” అంటాడు మరోచోట. మృత్యువు సమీపిస్తుంది అని అనుకొనే కొద్దీ ఈ జీవితం రుచిస్తుంది. ఇక మృత్యువులేదు అనుకుంటే రుచేలేదు జీవితంలో. మన చేతిలో ఉన్న ఒకానొక పదార్థాన్ని మరోగంటలో ఎవరోవచ్చి తీసుకుపోతారు, అప్పుడు అని పించినపుడు ఆ గంటసేపు ఆ వస్తువు అమోఘమనిపిస్తుంది కదా!

విచిత్రమైనభావాలు, విచిత్రమైన అభివ్యక్తీకరణరీతి గాలిబ్‌ను ఉరుదూ సాహిత్యంలో ప్రత్యేకస్థానాన్ని చేకూర్చిపెట్టినవి. ధ్వనిప్రధానమై, వ్యంగ్య స్ఫోరకమైన ఇతని రచన ఆనాటి సాహితీపరుల ఆలోచనారీతిలో కొత్త మార్పులను తీసుకొచ్చింది. గాలిబ్ ప్రత్యేకతావాది. ఇతరులంటే పూర్వులు పోయినమార్గం తనకు అక్కరలేదు. తాను కొత్తదారి వేసుకొని దానిమీదే నడవాలి. ఈ ప్రత్యేకతావాదం అతని రచనలోనే కాదు, జీవితంలో అడుగడుగునా కనబడుతుంది. పదిమందిలో ఒకడుగా బ్రతకడం గాని, చావడంగాని ఇష్టంలేదు. ఈ ప్రత్యేకతకు ఒకచిన్న సంఘటన ఉదాహరిస్తాను. గాలిబ్ చనిపోవడానికి ఏడెనిమిదిఏండ్లు ముందుగా అతను ఉన్నఊళ్ళో ఏదో అంటువ్యాధి—కలరావంటిది వ్యాపించింది. జనం విపరీతంగా చనిపోయినారు. “అందరితోపాటు నేనూచస్తే నా ప్రత్యేకత ఏమీ వుండదుకనుక ఈ మహమ్మారి తగ్గిపోయినతరువాత చావాలని ఇలాగే బ్రతికివున్నాను. లేకుంటే ఇంత వృద్ధాప్యంలో ఆ జబ్బు నన్ను వదిలేసిందంటే ఆశ్చర్యం కాదూ?” అంటాడు గాలిబ్

సంప్రదాయానికి భిన్నంగావెళ్ళే గాలిబ్ ఆకాలపు చాలామంది విద్వాంసులనూ, విమర్శకులనూ కష్టాలు కలిగించాడు. కాని పాఠకులూ, సహృదయులూ గాలిబ్‌రచనలలోని నూతనత్వాన్ని గుర్తించి అభినందించేవారు. గాలిబ్‌రచన చదువుతుంటే మనం ఇదివరకెన్నడూ చూడని కొత్త లోకాలు సాక్షాత్కరిస్తాయి. మైదానాల్లో జీవితం వెళ్ళబుచ్చినవాడికి పర్వతాలమీద ప్రయాణంచేసిన అనుభూతి, నేలమీద ఉన్నవాడికి సముద్రాలమీద సంచారం చేసిన అనుభూతి కలుగుతాయి గాలిబ్‌రచనలు చదివితే.

తనపూర్వులు నిర్మించిపెట్టిన రాజమార్గంమీద సుఖంగా ప్రయాణం చేయడంకాదు అతను కోరేది. తన మార్గం ఎంత చిన్నదైనాసరే తాను స్వయంగా నిర్మించుకొని దానిమీద వెళ్ళాలనేది అతని సిద్ధాంతం.

గాలిబ్‌రచనలలోని విశిష్టతను, ప్రత్యేకతను అవగాహన చేసుకోవటానికి అతని కొన్ని పద్యాలను ఉదాహరణగా పరిశీలిద్దాం.

''ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము,
నరుడు నరుడౌట యెంతో దుష్కరముసుమ్ము''

మొదట చదవగానే ఈ పద్యం ఏదో సాధారణభావాన్ని వ్యక్తపరుస్తున్నట్టు అనిపిస్తుంది. కాని సునిశితంగా పరిశీలిస్తే ఇందులోని లోతైనతనం హృదయానికి గిలిగింత కలుగుతుంది. ఈ ప్రపంచంలో చాలా సులభంగా జరగవలసిన పనికూడా చాలా కష్టంమీద జరుగుతుంది. మనం సులభం అనుకుంటాం కాని అవి దుర్లభమవుతాయి ఒకదశ. చూడండి! ఒకడు మనిషి మనిషి కావడం కూడా ఎంత కష్టమైన పనో! మనిషి మనిషికావడం ఏంకష్టం? అనిపిస్తుంది. కాని ఈనాడు మనకు కనిపించే మనుష్యుల్లో ఎంతమంది నిజమైన మనుష్యులు? అంటే నిజంగా మానవత్వంకలవా రెందరు? దయాదాక్షిణ్యాలు, ప్రేమ, స్నేహం, పరోపకారబుద్ధి కలవారెందరు? అట్టి సద్గుణాలు కలవాడే మనిషి. అందరూ మనుషులా? గాలిబ్ ఈ పద్యంలోని రెండవచరణంలో ఇచ్చినది తార్కిక సామ్యంకాదు. కవితాసామ్యం. అతను చెబుతోంది తార్కిక సత్యంకాదు, కవితా సత్యం. మొదటిచరణంలో అతను ప్రతిపాదించిన సిద్ధాంతానికి రెండవ పంక్తిలో సామ్యం ఇస్తున్నాడు.

మానవస్వభావాన్ని పరిశీలించడంలో గాలిబ్ దిట్ట. ఒకచోట అంటాడు:—

''ఎంతో ఉత్సాహపడుచు కష్టింతు నహర!
మృతియె లేకున్న రుచి యేది బ్రతుకులోన!

మృత్యువు సమీపిస్తున్నది. ఇంక ఎంతోకాలం మనం ఈప్రపంచంలో ఉండబోము అనే భావం మనస్సులో మెదులుతుంటే ఎంతో తొందర తొందరగా ఉత్సాహంగా లౌకిక సుఖాలను అనుభవించడానికీ, వాటిని సాధించడానికీ శ్రమించుతాం. కాని ఇక మృత్యువు రానే రాదనిపించినప్పుడు ఈ ఆరాటం, ఆతురత వుండవు. పైగా స్తబ్ధత ఆవరిస్తుంది. మృతి అనేది లేనట్లైతే బ్రతుకులో రుచి లేదుసుమా!

''హింసపడు మాకు బ్రహ్మాండ మెంతో ఇరుకు,
అందు గగనమ్మొక పిపీలి కాండ మంత.''

బాధపడుతున్నవానికి ప్రపంచం ఇంత విశాలంగా వున్నా చాలా ఇరుకుగా కనిపిస్తుంది. సంతోషం గలవానికి ఇదే లోకం విశాలతరమై స్వర్గధామంలా వుంటుంది. ఒకే వస్తువు ఇరువురికి రెండు రీతులుగా కనిపిస్తుంది. [illegible] మనస్సు. ఇక్కడ గాలిబ్ తన బాధను బొమ్మగీచి చూపుతున్నాడు. [illegible]

రాలి వియోగంవలనగానీ, మరి ఇతర దౌర్భాగ్యంవల్లగానీ హింసపడుతున్న తమకు ఈ అఖండ బ్రహ్మాండం ఎంతో ఇరుకుగా వుంది. ఎంత ఇరుకుగా వుందో మన హృదయానికి స్ఫురింపచేయడానికి ఒక ఉదాహరణ ఇస్తున్నాడు. విశాలమైన ఆకాశం చీమగ్రుడ్డుఅంత చిన్నగా కనపడుతున్నదట! అంత పెద్ద ఆకాశం చీమగ్రుడ్డంత చిన్నగా వుంటే ఇక బ్రహ్మాండం ఎంత ఇరుకుగా వుంటుందో ఊహించండి. ఆ ఇరుకుదనానికి కారణమైన ఆ దుఃఖం ఎంత లోతో భావించండి! ఇట్టి ఆలోచనారీతి అనన్య సామాన్యము. మొదటిపంక్తిలో ఒక సిద్ధాంతాన్ని ప్రవచించడం రెండవ పంక్తిలో దాన్ని గుండెకు హత్తించడానికి చక్కని సాదృశ్యాన్ని కూర్చడం గాలిబ్ ప్రత్యేకత.

ఏమి వచియింతు దౌర్భాగ్య మింతకన్న!
చచ్చిపోవుదమన్నను చావు రాదు.

తన దౌర్భాగ్యం ఎంత ఘోరమైందో చెప్పడానికి "చచ్చిపోదామనుకున్నా చావు రావడం లేదు" అంటున్నాడు. చావాలనీ, చస్తే బాధలు పోతాయనీ చావడానికి సిద్ధపడ్డవానికి చావు రాకపోతే ఎంత దౌర్భాగ్యం! దౌర్భాగ్యాన్ని ఇంతకంటే స్పష్టంగా చెప్పడం అసాధ్యమేమో!

"నీటిచుక్క ముత్తెమౌట వర్జించెను
కనులలోన నిలువగలిగె తాను."

నదిలోనే ఉండిపోతే నీటిచుక్క మహా అయితే ముత్యం అవుతుంది. అంతకంటే నదీజలానికి విశిష్టమైన రూపం మరొకటి రాదు. కాని నీటిచుక్క ముత్యం కావడానికి ఇష్టపడక, ఆ పదవిని తిరస్కరిస్తే అది ఎవరి నయనాలలోని కన్నీటిచుక్కైనా కావచ్చు. కన్నులలో కన్నీటి చుక్కగా వెలిగి నయన సింహాసనం మీద ప్రతిష్ఠ పొందడం ముత్యం కావడంకన్న వేయిరెట్లు విలువైనది. ముత్యమే అయితే ఏ కంఠంలోనో మాలగా వెలుగుతుంది. ఎవరి చెవులకో ఆభరణంగా పరిణమిస్తుంది. కాని కాంతిమయమై, అన్ని ఇంద్రియాలలోనూ ప్రధానమైన నయనంలో స్థానం సంపాదించుకోడం సాధ్యపడుతుందా? కన్నీటిచుక్క ముత్యంకంటే కడు విలువైనది అని చెప్పడానికి ఈ పద్యం రాశాడు గాలిబ్. ముత్యం కావడంతో తృప్తిపడితే ఆ బిందువుకు ఈ పదవి లభించేది కాదుగదా! ఉత్తమ కల్పన ఇది.

"ఈ యజాండమ్ములోన నశించు నన్ను,
గాలిలో దీపమట్లుండెగాదె రవియు!"

మొదటిపంక్తిలో ఒక "స్టేట్‌మెంట్" చేస్తున్నాడు కవి. రెండవపంక్తిలో

ఆ "స్టేట్‌మెంట్" సత్యాన్ని రుజువు పరుస్తున్నాడు. రెండవపంక్తి వినేసరికి మన హృదయంలో గాలిబ్ సిద్ధాంతం తిష్ఠ వేసుకుంటుంది. నిజంగా ఈ ప్రపంచంలో నశించని వస్తు వేది? ప్రతిదీ నశిస్తుంది. సూర్యుని అనేక గోళాలు తన కుటుంబంలో చేర్చుకుని జాజ్వల్యమానంగా వెలుగుతున్న ఆ సూర్యుడో? సూర్యుడుకూడా నశిస్తాడు. సూర్యుడు గాలిలో దీపంలాగా వున్నాడట! గాలిలో దీపాన్ని సూర్యునితో పోల్చడం ఎంతో బావుంది. విశాలాకాశ మండలంలో సూర్యుడు దీపంలాగే ఉంటాడు. ఒక నాటికి ఆరిపోతాడు.

"గాయపడిన నా గుండెను కాంతురేల?
తరుణీకరమున కే దృష్టి తగులునట్లు"

ఇది వ్యంగ్యార్థస్ఫోరకమైన పద్యం. తన గుండెకు బలమైన గాయం తగిలింది. జనులు ఆ గాయాన్ని లేదా గాయపడిన గుండెను చూస్తున్నారు. తన గాయపడిన గుండెను జనులు చూస్తే, గుండెను గాయపరచిన తరుణీకరమునకు దృష్టి తగులుతుందని భయం. ఇందులో రెండర్థాలు స్ఫురిస్తాయి. ఒకటి— తన గుండెను అంతగా గాయపరచిన చేయి ఎంత కోమలమైనదై ఉండాలి. అలాంటి ప్రియాకరమునకు దృష్టి తగులుతుందేమో అని. రెండవది— అంత గాయం కలిగించిన ఆ చేయి ఎంత కఠినమైనది! అని.

"నాకమును పారవేయుడీ నరకమందు
అమృతమాశించు భక్తుల యాశ లుడుగ"

చాలామంది దైవభక్తులు స్వర్గంలో అమృతం లభించుతుందనే ఆశతో భగవంతుణ్ణి ధ్యానిస్తుంటారు. అసలు స్వర్గాన్ని తీసికెళ్ళి నరకంలో పారేస్తే ఇక అమృతం ప్రసక్తి లేదు. అప్పుడు అమృతాన్ని ఆశించే భక్తులుండరు. నిష్కామంగా, నిస్స్వార్థంతో దేవుణ్ణి కొలిచే నిజమైన భక్తులు కొద్దిమందే అప్పుడు సాక్షాత్కరిస్తారు.

గాలిబ్ తన భావాలను వ్యక్తీకరించే పద్ధతి ఎలావుంటుందంటే, అతని పద్యం చదవగానే సరిగా అదే భావం మనమనస్సులో ఇదివరకే నిరాకారంగా ఉన్నట్టున్నా, సరిగా అదే భావాన్ని అతను వెలువరించినట్టున్నా అనిపిస్తుంది. మనం చెప్పదలచుకున్నదే అతను చెప్పినాడా అనిపిస్తుంది. అంటే అంత చక్కగా హృదయంలోకి చొచ్చుకుపోతుం దన్నమాట.

ఉపమానాలకు గాలిబ్ కాళిదాసుతో పోలగలవాడు. ఇతరులు వాడిన ఉపమాసామగ్రిని అతడు వాడబోవడు. సరిక్రొత్త ఉపమానాలను తాను సృష్టించుకుంటాడు.

"భ్రుకుటిక్రిందుగ నయనమ్ముపోల్కి-గాన
ఆలయముపంచలనె పానశాల వలయు."

కనుబొమ్మక్రింద కన్నుంటుంది. అది సహజం. అంత సహజంగా ఆలయమువద్ద పానశాల ఉండాలంటాడు. భ్రుకుటి చూడలేదు. కన్ను చూస్తుంది. ఆలయంలో కనిపించే దేమీ లేదు. పానశాల సమస్తలోకాలనూ కళ్ళకు కడుతుంది. అయితే రెండూ విరుద్ధం. అయినా ఒక్కచోట ఉండవచ్చు. కనుబొమ క్రిందుగా కన్నులేదా? అలాగే. ఎంత చక్కని ఉపమానము!

"ప్రతికుసుమముకుళ మెమ్మెక రక్తకణము
కోమలీరాగరంజితాంగుళికవోలె"

ప్రతిపూలమొగ్గా రక్తకణంలా కనిపిస్తున్నదట. ఎర్రగా కనబడుతున్న ప్రతి కుసుమముకుళం ప్రియురాలి రాగరంజితమైన ప్రేలికలె వుందిట. పువ్వుమొగ్గను ఎరుపురంగద్దిన కోమలమైన అంగుళితో పోల్చినాడు.

గ్రీష్మమున వాన కురిసిన నూష్మమెసగు,
నల్ల కన్నీటితో గుండె నగ్గి పెరిగె"

ఎండాకాలంలో వర్షం కురిసితే భూమి చల్లపడడానికి బదులు ఆవిరులు లేచి మరీ ఉబ్బ ఎక్కువవుతుంది. అలాగే కన్నీళ్ళవల్ల గుండెల్లోని చింతాగ్ని చల్లారదు సరిగదా ఇంకా ఎక్కువవుతుంది. కన్నీళ్ళవలన మరీ పెరిగే చింతాగ్నిని గ్రీష్మకాలంలో వానకురియగా వచ్చిన ఊష్మంతో పోల్చడం ఎంతో మనోహరంగా వుంది. కాళిదాసాదులుతప్ప అన్యులకింత చక్కని ఉపమ అందదు.

"దరులు నదినీరు కోరినకరణి, సాకి!
ఎంత త్రాగింతు నంత వాంఛింతు మధువు"

సాకీ అనగా మధువందించునది. ఆమెతో అంటున్నాడు——"నదిలో ఎంత నీరొచ్చినా ఇంకా కావాలనే అంటాయి గాని దరులు తృప్తిచెందవు. అలాగే నాకు నీవు ఎంత మధువును ఇచ్చితే అంతా పుచ్చుకుంటాను. చాలును అనను" అని.

"సహృదయునకు బయట సన్మానమబ్బును
శుక్తి విడిననాటి మౌక్తికముగ"

సహృదయుడైనవాడు ఇంటిలోకంటే బయటనే ఎక్కువ సన్మానం పొందుతాడు. తన దేశంలోకంటే ఇతర దేశంలో ఎక్కువ ఆదరం పొందు

కాదు. ముత్యపు చిప్పలో ముత్యం ఉంటే దాని విలువ ఏమీ లేదు. అది బయటపడి విపణిలో ప్రవేశిస్తే దాని విలువ తెలుస్తుంది.

‘‘పూలు ముక్కోపి వారి ముఖాలవోలె
ఎఱ్ఱబడిపోవు, నంతలో కఱ్ఱియగును’’

ముక్కోపులైనవాళ్ల ముఖాలు కోపంలో క్షణంలో ఎఱ్ఱబడిపోతాయి. మళ్ళీ అంతలో నల్లబారిపోతాయి. అలాగే పూలు అంతలో ఎఱ్ఱగా కనపడతాయి. అంతలో కాంతులుడిగి, వాడి వత్తలై వెలవెలబోతాయి. ముక్కోపుల ముఖాలతో పూలను పోల్చడం బాగాలేదూ!

‘‘హృదయదీపమ్ము మలిగిపోయినదిగాన
పొగ వినీలాంబరము కట్టి పొగుల జొచ్చె.’’

దీపం మలిగిపోగానే పొగ గుప్పున లేస్తుంది. భర్త గతించినా భార్య చింతాక్రాంతురాలై నీలిరంగు చీరలు కట్టుకున్నట్టు దీపం మలుగగానే పొగ నల్లబట్టలు కట్టుకున్నదట.

‘‘వ్రాయునపుడు సిరా యొల్కిపడినయట్లు
విరహానిశలు నా బ్రతుకున మరక లిడెను.’’

రాసేప్పుడు చప్పున కలంలోనుంచి సిరా పడితే కాగితం వికారమైపోతుంది. అలాగే శుభ్రమైన బ్రతుకులో విరహ రాత్రులు మరకల్లా తగిలినాయి. మంచిరాత్రులు, మంచి అక్షరాలవలె జీవిత పత్రంమీద శోభను చేకూర్చుతవి. కాని అవి విరహరాత్రులైనప్పుడు సిరామరకలవలె వికారంగా ఏర్పడుతవి.

‘‘నిప్పు నీళ్ళలో పడగానె చప్పుడగును
ఎదియు నశించునపుడు రోదించు గాదె!’’

చుంయిమంటుంది నీళ్లలో నిప్పు పడ్డప్పుడు. నీళ్ళల్లో నిప్పుపడటమంటే నిప్పు నశించడమే కదా! అలాగే బాధతో మానవుడు చనిపోతున్నప్పుడు గోల చేస్తాడు. నేనుకూడా అలాగే విరహవేదనలో నశిస్తున్నాను. కనుక ఏడుస్తున్నాను— అంటాడు గాలిబ్. నిప్పు నీళ్ళలో పడినప్పుడు అది ఆరిపోవుటవలన కలిగే శబ్దాన్ని, తాను నశించేప్పుడు వచ్చే దుఃఖాక్రందనతో పోల్చినాడు.

‘‘వెలుగుచున్న దివ్వె మలిపివేసినయంత
కానిపించు నల్లనైన మచ్చ,

అన్ని పూర్తికాని అభిలాషముల మచ్చ
గుండెలోన కూరుచుండె నాకు.''

కొవ్వొత్తిని మధ్యలో ఆర్పితే ఆ వత్తిచుట్టూ నల్లగా మచ్చ కనపడుతుంది. అలాగే అభీష్టసిద్ధి జరుగకుండానే కోర్కెలు తెగిపోతే గుండెలో మచ్చ ఏర్పడి బాధిస్తూవుంటుంది.

''గగనమునను 'సాకి' కడ సౌఖ్యమధు వేది?
బోరగిలిన గిన్నెవోలె నుండె.''

మానవుల జీవిత చక్రాన్ని నడిపే నవగ్రహాలు ఆకాశంలో వుంటాయి. కనుక ఆకాశం అందరి అదృష్టాలకూ కర్త. అలాంటి ఆకాశాన్ని మధుకందించే సాకీతో పోల్చినాడు. అయితే ఈ ఆకాశాలు, గ్రహపంక్తి తమవద్ద సౌఖ్యమును ఇవ్వజాలుటలేదు. అంటే ఈ సాకీ వద్ద మధువు లేదు. ఆకాశం బోరగిలిన గిన్నెలా వుంది. అందులో మధువు లేదు. ఆకాశం బోర్ల వేసిన గిన్నెలా కనపడుతుంది. పరికించి చూడండి!

గాలిబ్ ఉపయోగించే రూపకాలు, సంకేతాలు విచిత్రంగా వుంటాయి:

''మెరుపొకటి వచ్చి కనులలో మెరిసిపోయె
కొంత మాటాడగా దప్పిగొంటి నేను''

ప్రియురాలు మెరుపు మెరిసినట్లు వచ్చింది, పోయింది. అంతమాత్రాన ఏమి తృప్తి! ఆమెతో కాస్త మాట్లాడాలనే తృష్ణ తీరనైనా లేదుకదా!

''వానచినుకుల మ్రింగగా వాగులోని
ప్రతితరంగము బుడగలై వాయి విచ్చు,
శుక్తిలో జేరి చినుకులు మౌక్తికమ్ము
లగుట కెన్నొ యాటంకము లావహించు.''

మానవుడు పూర్ణత్వాన్ని పొందడానికి ఎన్నో ఆటంకాలను ఎదుర్కోవాలి. ముత్యం కావడానికి పైనుంచి దూకిన వానచినుకను ప్రతితరంగం బుడగలాగా మ్రింగజూస్తుంది. శుక్తిలోకి వెళ్ళలేకపోతే అది వృథా అయినట్లేకదా!

''గ్రంథి పడనినాడు కలవయ్యె నఖములు
గ్రంథిపడెను నేడు, కలదె నఖము?''

దారానికి చిక్కుముడి పడితే గోటితో విప్పుతాం. అయితే ఇందుకు కూడ

ఆ కోరికలు ఆకారం ధరించివచ్చి నిలిచాయేమో వెంటబడతాయంటాడు. ఇక్కడ ఆమె రాగరంజిత పాదాలకు ఎఱుపుఅద్దిన మైదాకుచెట్లు గుబురుగా అతని సమాధిచుట్టూ పెరిగి, అతని అసంపూర్ణవాంఛితాలను తెలుపుతున్నాయట! ఇంత శోకాకరమైన భావం వున్నా అందులోనూ హాస్యం చొప్పించినాడు గాలిబు.

''కలను కానుపించె పలికె 'వత్తు'నటంచు
బ్రతుకునెల్ల నిద్రపట్టలేదు.''

ఒకనాడు ఎన్నడో స్వప్నంలో ప్రియురాలు కనబడి వస్తానన్నదట. ఏక్షణాన వస్తుందో అని జీవితమంతా నిద్రపోకుండా వేచివున్నాడట! నవ్వు తెప్పించే ఈ భావంలో ఎంతో వేదన వుంది. జీవితాంతం ఆమెకై నిరీక్షిస్తూ నిద్రపోని ప్రియుని బాధ వుంది.

''ఏల కాళ్ళు నొచ్చె బాలామణికి? రాత్రి
ఎవని స్వప్నసీమ కేగివచ్చె?''

ఆమెకు కాళ్లు నొప్పులుగా వున్నాయని తెలిసింది. వస్తే ఎవరింటికీ వెళ్ళదు. ఎవరినీ అనుగ్రహించదు. అలాంటిమనిషి ఎవరి స్వప్నంలోకైనా వెళ్ళివచ్చి వుంటుంది. అందుకే కాళ్ళు నొచ్చినవి అని హాస్యం చేస్తున్నాడు గాలిబ్. తన ఇంటికి ఒక్కనాడూ రాలేదామె. ఎవరింటికీ వెళ్లలేదు. కాని తనవలెనే ఎందరెందరినో స్వప్నంలో కనిపించి బాధిస్తున్నది. ఇష్టురాలైన స్త్రీ లభ్యం కానప్పుడు స్వప్నంలో ఆమె తనవద్దకు వచ్చినట్లు కనిపిస్తుంది.

''పానశాలయు లేని దేశైన నేమి!
బడి, మసీదు, సత్రమున్న, సర్వము నొకటె''

కావలసింది పానశాల. అది లేనప్పుడు బడి, మసీదు, సత్రము—ఇవి ఎంత విశిష్టమైనవైనా తనకు అన్నీ ఒకటేనట!

గాలిబ్ వివిధవిన్యాసాలను సూఫీ రచన సాగించినాడు. రసార్ద్రమైన ఈయనకవిత ఏవిషయం తీసుకొని రాసినా రమ్యంగా వుంటుంది. శృంగారపరమైన ఈయనరచనలు ఇనుమడించిగా ఆనందాన్ని కలిగిస్తవి. ''శృంగార ఏవ మధురః పరప్రహ్లాదనో రసః'' అన్న ధ్వన్యాలోకసూక్తి గాలిబ్ రచనల అన్వర్థకము. శృంగారంలోనూ విప్రలంభశృంగారాన్ని ఆశ్రయించిన గాలిబ్ రచనలలో మధుర వేదన అడుగడుగునా కనిపిస్తుంది. విప్రలంభ శృంగారరస భరితములైన ఈయన పద్యాలకు భగవత్పరమైన అర్థం చెప్పడానికి కొందరు ప్రయత్నిస్తారు. కాని ఉర్దూభాషా విమర్శకులు ఆ భావాన్ని అంగీకరించ

లేదు. అక్కడక్కడ భగవత్ పరమైనవి లేకపోలేదు గాని, ఎక్కువగా నిజంగా ప్రేయసీ పరమైనవనుటలో సందేహం లేదు.

తనను వరియించని ప్రేయసికై విరహావివశుడైన ప్రియుడు అనుభవించు వేదన గాలిబ్ గజళ్ళలో పరిస్ఫుటంగా కనిపిస్తుంది.

"అన్ని రోగములకు నౌషధం బుండియును
ప్రణయరోగమునకు గనము మందు"

మానవుని హృదయంలో ప్రణయం ఏర్పడితే అది హృదయాన్ని కలచి వేస్తుంది. దానికి మందు లేదు. ఇతర రోగాలకు మందుంది గాని వలపువేదనకు మందేది? తొలివలపు రుచిగానే వుంటుంది. మనస్సు పులకిస్తుంది. హృదయం స్పందిస్తుంది. ఒంటరితనపు జబ్బుకు మందు లభించినట్లవుతుంది. కాని క్రమంగా వలపే వలవంతగా పరిణమిస్తుంది.

"వలపువలన బ్రతుకు బహుదుచ్ఛమైనది,
ఎడద తీయదనము బడయసాగె,
బాధ కౌషధమ్ము బడసియు నొందఁబు
మందులేని బాధ నందె మరల"

చిరకాలం కోరించి ఒకనాడు అదృష్టవశాన ప్రియుణ్ణి కనికరించిన ప్రియురాలు అతడు తన ఇంటిలోకి రావడానికి అనుమతించిందట. ఇన్నాళ్ళకైనా ఆమె కనికరించిందని సంతోషించి ప్రియుడు తనపక్క చుట్ట తెచ్చుకుని ఆమె ఇంట్లో పరుచుకున్నాడు. అంతలో ఆమెకు మళ్ళీ కోపం వచ్చింది. వెళ్ళి పొమ్మన్నదట. ఈపద్యం చిత్తగించండి :—

"ఇంట నుండంగ ననుమతి నిచ్చి తీవు
చుట్టియుండిన నా "ప్రక్క" నట్లె విప్పి
పఱచితినో లేదో శయనించుకొఱకు నేను,
అంతలో "వద్దు, వద్దు పో" మ్మందువేమి ?"

పడక పరచుకొనేలోగా మనసు మారిన చంచలురాలైన ప్రియురాలి మనస్థితిని ఎంతో చక్కగా చెప్పినాడు.

"ఎంతకని వ్రాతు నా గుండెవ్యథంత? నింక
ఆమెకే చూపెదను రక్తలాంగుళులను."

దుఃఖంతో తాను చనిపోయినాడు. లోకమంతా, తనను చంపింది ఆమే, అని ఆమెను నిందిస్తున్నారు. "నిన్ను నిందించడం దేనికి? నన్ను చంపింది నీవు కాదే, పాపం! నా దుఃఖమే నన్ను చంపింది. లోకం నిన్ను నిందిస్తుందేమిటికి?" అంటున్నాడు ప్రేయసితో. "నీ వల్లనే నేను దుఃఖపడి చచ్చినాను" అనే అర్థాన్ని ధ్వనిగా అందిస్తున్నాడు కవి. చక్కని వ్యంగ్యప్రధాన కవిత.

"అన్ని బంధాల విదలించినట్టి నెమ్మొకద
కురుల ఉరులందునట చిక్కుకొనెను, చెలియ!"

అన్ని బంధాలను విదిలించుకున్న తన హృదయం, తన ప్రియురాలి కురులు అనే ఉరులనుండి మాత్రం తప్పించుకోలేక వాటిలో చిక్కుకొన్నదట!

ఇన్ని బాధలు అనుభవిస్తున్నా ప్రణయాన్ని వదులుకోలేడు:

"జ్వాలయే దీపమునకు సర్వస్వమట్లు
ప్రణయమే జీవితంపు సర్వస్వమయ్యె."

తనలో దాగలేకయున్న వేదనను చెబుతున్నాడు:

"నన్ను కవ్వించకుమోయి, నా కన్నులందు
అశ్రుదుంగనామరుత్ సమూహములు కలవు."

తన కన్నులలో కన్నీటితుఫాను ఉన్నదట!

"వత్తువని మాట నిచ్చె నా వలపురాణి
ఎదురుచూచెద, రాకపోయినను గాని"

వస్తానని మాట ఇచ్చింది. రాదని తనకు తెలుసు. అయినా ఎదురు చూస్తాడట. దానిలోనైనా కొంత తృప్తి లభిస్తుందేమో!

"ప్రణయమున చావుబ్రతుకు, సర్వమ్మునొకటు,
ఎవరికై చావగలనొ, జీవింతు గూడ"

ప్రేమ సంతలో చావుబ్రతుకులు రెండూ ఒకటే. ఒకటి ప్రియము కాదు, ఒకటి అప్రియము కాదు. కాని నీ కోసం చనిపోగలను, నీ కోసం బ్రతుకగలను కూడా.

"నీదు కనుచూపు కత్తిగా నెడదనంద
జొచ్చినపుడు మిత్రమునోలె జూచినాండు"

ఆవిడ చూపు కత్తివలె గుండెలో గుచ్చుకున్నది. హృదయంలో ప్రవేశించిన దానిని మిత్రునివలె చూచుకోవలెగనుక కత్తినైనా మిత్రునివలె గాఢముగం టాను. నీ చూపు నాగుండెలో దిగి బాధిస్తున్నది. అయినా ఆ చూపును ఇష్టంగా స్వీకరిస్తాను.

ఇంచుమించు ఇలాంటి భావమే మరికొంత అందంగా ఈ కిందిపద్యంలో చెప్పినాడు గాలిబ్

"ఎడదలోనుండి వెడలిన, వెడలకున్న
ప్రాణాలు నీబాణమునకితోగ్రమ్మ ప్రియమగు"

ప్రియురాలు విడిచిన బాణం గుండెలో గుచ్చుకుంది. అయితే వెలికి తీయరాకుండా వుంది. తీయవచ్చినా, తీయరాకున్నా గుండెలో గ్రుచ్చుకున్న నీబాణం నాకు చాలా ప్రియమైనది అంటున్నాడు. బాణం మునగా ఆమె చూపే కావచ్చును, లేదా ఆమె వలపే కావచ్చును. బాధించేదే అయినా అది తన హృదయంలో గ్రుచ్చుకున్నదిగనుక తనకు ఆ బాణపు వాడిముల్లు ప్రియమట!

"ఊహలోనున్న ఆమెకై ఉబ్బిపోగా
మధువు నూహించి పాడెడి మధుపమట్లు."

ఆమె ఇంకా తనకు లభింపనేలేదు. అప్పుడే ఆమెకోసం ఉబ్బిపోతున్నాడు. తేనె ఇంకా గ్రోలకుండానే కేవలం తలపుతో పాటపాడే మధుపంలాగా వుంది ప్రియుని పరిస్థితి.

నిజానికి, మధుపానం చేసినతరువాత ఆ నిండుమత్తులో మధుపం పాడలేకపోవచ్చు, అనుభవించినతరువాత మాధుర్యంపై ఆసక్తి తగ్గవచ్చు. కనుక మధువుకై ఆరాటపడుతున్నప్పటి మధురానుభూతి తరువాత కలుగదు. ప్రేయసికొరకై నిరీక్షించడంలో కలిగే అనుభూతి ప్రియాసంయోగం తరువాత సన్నగిల్లడం సహజం. కోర్కెలు ఫలించకపోవడమే మేలేమో!

"వెతల కుండెడివాడు నవ్విన విధాన,
పైన సంతోషమును, లోన బాధ నాకు"

తానెప్పుడైనా సంతోషంగా కనుపడ్డా అది పైపై నవ్వే గాని లోనమాత్రం బాధే.

"బాధ భరియింపలేక బాష్పజల మౌఘ్ని
దాన తానమాడితి, పవిత్రతను గంటి"

గుండెలో బాధ తగ్గాలంటే కన్నీరు కార్చాలి. అప్పుడు కాస్త బరువు తగ్గిన ట్లౌతుంది. ఆ కన్నీళ్ళలో స్నానం చేస్తే పాపాలు క్షాళితము లౌతాయి. పవి త్రత ఏర్పడుతుంది.

"ఆననము చూపకుండిన పోనిగాని
ముసుగు తీసి కుపిత నేత్రములనె చూపు"

నీ అందమైన ముఖాన్ని చూపడం ఇష్టం లేకపోతే, నీ కోప సంభరిత నేత్రాల నైనా చూపించు. ప్రసన్నవదనంతో కనపడకుంటే పోనీ. కోపంతో నా వైపు చూసినా చాలు. ఆ కోపం తొణికిసలాడే కన్నులైనా ఆ ముసుగు తొలగించి చూపు!

"ఎంత దుష్టురాలవే! నిరాశాదేవి!
హృదయ మార్తి నె మరపించజాలవు."

ఇక ఆమె లభించదనే నిరాశ బలంగా నాటుకుంటే ఆమెను క్రమంగా మరువ గలుగుతాడు. కాని ఆమెను మరువడం ఇష్టం లేదు. మరపు కలిగించడానికి ప్రయత్నించే నిరాశాదేవిని నిందిస్తున్నాడు. ఎంత గాఢమైన నిరాశ కలిగినా ఆమెను మరువడం ఇష్టం లేదు తనకు.

"ఆమె కోపము; నాకథ అస్సకదీర్ఘ,
పూర్తి వినిపింప సందేహమాయె నాకు."

నా సంగతేమో ఆమెకు కోపం. ఇక తన వేదనాకథ సుదీర్ఘం. అలాంటి కథను ఆమెకు వినిపించగలనని సందేహాస్పదం పైగా వాడితో భయం కలుగు తున్నది. ఆమె ఏమంటుందో? అసలు వింటుందో? అసలే ఆలోచన.

"కరుణ గలిగియు తన పూర్వసరణి దలచి
సిగ్గుతో తాను వెనుకకు తగ్గెనెచ్చ."

పూర్వం బహుకఠినంగా ప్రవర్తించింది ఆమె. కాని ప్రియుని దీనావస్థ చూచి కరుణ కలిగింది ఆమెకు. అయినా పూర్వం కఠినంగా ప్రవర్తించేది ఇప్పుడు మారితే లోకం ఏమనుకుంటుందో అని సిగ్గుపడి తన కారుణ్యాన్ని ప్రదర్శించ డానికి వెనుకాడుతున్నది. కరుణ కలిగినా కాఠిన్యమే ప్రదర్శిస్తున్న దని భావం.

"దుఃఖవిష మింక గళమునే దూరలేదు
నరములన్ చేరినపు డెంత నరకమగునొ!"

ఇంతా సరీగా గొంతులోకి చేరలేదు దుఃఖమనే విషం, అప్పుడే ఇంత బాధగా వుంది, ఇక అది డొక్కల్లోకి వెళ్లి జీర్ణించి రక్తంలో కలిసి రక్తనాళాల్లో ప్రవహిస్తే ఎంత నరకంగా వుంటుందో?

"ఇంతి దారికి వచ్చెడిదేమొ తుదకు,
నీవు తొందర పడి మరణించినావు."

తనతో తానే అనుకొంటున్నాడు. నీవు బాధ భరించలేక తొందరపడి చని పోయినావుగాని బ్రతికివుంటే మరికొన్నాళ్లకైనా ఆమె దారికివచ్చి నిన్ను కనికరించేదేమో! ఎంత బాధైనాసరే మరికొన్నాళ్ళు బ్రతుకవలసి వుంటిది. ఆమె దారికివచ్చి నిన్ను ఆదరించేదేమో!

"ఇంత దుఃఖము సైప నా కేక హృదయ
మేల? ఒకపది ఇవ్వవైతేమి? దేవ!"

బాధ భరించవలసింది హృదయం. అయితే ఉన్నది ఒక్కటే హృదయం. బాధ చాలారెట్లు ఎక్కువైపోయింది. ఇంత బాధను భరించే శక్తి ఆ ఒక్క హృదయానికి లేదు. కనుక దైవమా! ఒక్క హృదయాన్నే ఎందుకిచ్చావు? ఓ, పదిహృదయాలు ఇవ్వక పోయినావా? దుఃఖాన్ని భరించ గలగడంలో అవి తోడ్పడేవి. దీన్ని పట్టి అతని వేదన ఎంతో అంచనా వేసుకోవచ్చు.

"నను వదలి పోగవలె నేగ నాదుసీస
గుండెలో అగ్గి గలవాని గోడునేది?"

తాను సుఖపడి ఇతరులను సుఖపెట్టే దానికద్ద ఎవరైనా ఉండడానికి ఇష్టపడ తారు. కాని ఇతని గుండెలో అగ్గి కలవాడు కనుక సీసకూడా ఇతన్ని విడిచి వెళ్ళిపోయింది. ఇప్పుడు మరీ ఒంటరివాడైనాడు. తనను సీస వదలిపోవడాన్ని నిప్పులోనుంచి పొగ వెలికి వచ్చిపోవుటతో ఉపమింపజేసినాడు. కడు రక్తి పోలిక.

"తరుణీదీర్ఘ కేశములు సౌందర్యఘనులు
వెలసినవి నేడు నన్నురి పెట్టుకొనుటకు."

ఆమె పొడవైన వెంట్రుకలు అందాలకు నిలయాలు. కాని అవి తనను ఖాళ్యాను బిగించడానికి ఉరులు ఇప్పుడు ఊరి పోస్తున్నవి. అనగా ఆమె అనుగ్రహించు

నప్పుడు తాను ఆ కలలను ఆనందించగలడు గాని, ఇప్పుడు ఈ విరహ సమయాన అవి మరీ బాధ పెడుతున్నవి.

“కలలలో నామె నా స్థితి తెలియవచ్చు,
కనుక ప్రత్యక్షముగ నడుగంగ రాదు.”

తన పరిస్థితులు తెలుసుకోడానికి ఆమె కలలో వస్తుంది. ప్రత్యక్షంగా రాదు. కనుక ఆమె తనను యెందుకు బాధిస్తున్నదో అడగాలంటే కలలోనే అడగాలి. ప్రత్యక్షంగా అడగడానికి వీలులేదు. ఎందుకనగా ఆమె ప్రత్యక్షంగా రానే రాదు. కలలో రావడం అనగా ఆమె తనవద్దకు రానేరాదని అర్థం.

“నా సమస్త మెరింగియున్నయట్టు లామె
మోసగించును, నింకేమి చెప్పుదును నేను?”

అదృష్టవశాన ఎప్పుడైనా ఆమె కనబడితే నా కష్టసుఖాలు చెబుదామను కుంటాను. కాని చెప్పబోయేటప్పటికి నా సమస్తం తనకు తెలిసినట్లు నటించి మోసగిస్తుంది. ఇక నేనేమి చెప్పేది? చెప్పే అవకాశం వచ్చినప్పుడు కూడా నన్ను తాను చెప్పనీయదు.

“ఆమె బాధించు నాడు క్షేమ మరయు,
ఏమి చెప్పెదు వారిలో నింక నేను?”

ఎవ్వరూ లేని ఏకాంతస్థలంలో కలిసి ఆమె నా క్షేమం అడిగితే నా దౌర్భాగ్యాన్ని గూర్చి, బాధలను గూర్చి చెప్పుకుంటాను. కాని వారిలో పదిమంది యుండగ “క్షేమమేనా” అని అడుగుతే ‘ఆ’ అని తలయూపవలసిందే గాని చెప్పుకోడానికి వీలులేదు గదా! ఈ విధంగా నా బాధలను నేను చెప్పుకోడానికి వీలిక్కకుండా లాంఛనంగా “క్షేమమేనా” అని అడిగి “ఆ” అనిపించుకొని తెలివిగా బయటపడుతుంది వారిలో కలిసి.

“నిండుచూపు నే గోరి వేచితి,
కాంత వేసెను అరకంట తుదకు!”

నిండుచూపు అనగా ప్రేమ కలిగి, కనికరము కలిగి, అనుగ్రహించ సిద్ధపడిన ప్రియురాలి చూపు. అట్టిచూపును కోరి ఇంతకాలం వేచియుంటే తుదకు అరకంట చూసావేమే? అనగా నిండుచూపు కోరినవానికి అరకంటిచూపు చాలదు. చమత్కారము!

"మొరపెట్టుకొనుటకై స్వరతాళములు లేవు
కన్నీటిపాటలో గిటకరీలు కనరావు"

దుఃఖం వెళ్ళబోసుకోడానికి స్వరాలు తాళాలు ఎందుకూ? కన్నీటి పాటకు గతులూ యతులూ ఎందుకు? హృదయంలోనుండి పొంగులెత్తి వచ్చే బాధకు నియమాలు నిబంధనలు లేవు.

"స్వప్నమందు తాను వచ్చి నన్నోదార్చి
శాంతపరచినేని చాలు నాకు,
కాని దుఃఖవహ్ని కాసంత నిద్దుర
పట్టనీదు, స్వప్నమెట్టులబ్బు?"

ఆమె నిజంగా రాకున్నా సరే, కలలోనైనా కనపడి ఓదార్చితే అంతకే తృప్తిపడతాను. కాని కలలోకూడా నాకు ఆమె కనపడే భాగ్యంలేదు. ఎందుకనగా, దుఃఖంవల్ల రవ్వంతైనా నిద్రపట్టదు. నిద్రపట్టనిది కల ఎలా వస్తుంది? విచిత్రమైన కల్పన!

"చానగోరెడు వానికి చావురాని
ఘోరదుర్గతి నిక చూచి తీరవలయు"

చావాలనుకొన్నవానికి చావురాకుంటే అంతకన్నా ఘోర మేముంటుంది?

"పీడవో, పిశాచమవో, దుర్విధివోగాని
నీవు నాదానవైతివేని అదె చాలు"

నీ వల్ల నాకు చాలా కష్టాలు కలిగినవి. నీవు పీడవే అయినా, పిశాచమువే అయినా, దుర్విధివే అయినా నీవు నాదానవైతే నాకు తృప్తి. బాధిస్తున్నావు గాని నా దానివి కాకుండా ఉన్నావు.

"తరుణిచేతి అంబు తగులునట్లుగ నిల్చి
గాయపడగ కోర్కి గలదు నాకు,
అంబు తగులదేసి అద్దాని గొనిపోయి
తరుణి కిత్తు మరల తాను వేయ"

ప్రియురాలి చేతి బాణపుదెబ్బ తినాలని కోరిక ఉన్నది. ఆమెవలన సుఖం లభించకుంటే పోనీ కష్టమైనా కలిగితే దాన్ని అనుభవించి తృప్తిపడతాను. ఆమె బాణం ఎక్కుపెట్టగానే ఎదురుగా నిలుచుంటాను. తగిలా

నేనున్న వీధినుంచే పల్లకీలో ఆమె వెళుతున్నది. అయితే ఎలాగో గాలిబా నన్ను తప్పించుకుని పోవాలని ప్రయత్నం. పల్లకీ బరువుకల్ల బోయీలు భుజాలు మార్చుకుందామనుకుంటే అందుకు అనుమతించకుండా గాలిలా వెళ్ళిపోతున్నది.

''వానరాత్రి నిన్ను వదలి యెట్టులు పుత్తు?
లెక్కబెట్ట నొక్క చుక్క లేదు.''

విరహంలో ఆకాశంలోని చుక్కలను లెక్కపెడుతూ రాత్రులు ఒంటరిగా గడుపవలసి ఉంటుంది కాని మబ్బుపట్టిన రాత్రి ఒక్క చుక్కైనా కనబడదు. ఏమి లెక్కపెట్టను?

''ఉన్న హృదయ మొకటి—నిన్ను చూడని బాధ,
నిన్ను వినని బాధ యెన్న రెండు.''

హృదయమేమో ఒక్కటి. కాని బాధలు మట్టుకు రెండు. ఒకటి – నిన్ను చూడలేదన్న బాధ, రెండవది – నీవు మాట్లాడగా విను భాగ్యం కలుగదాయెనే అన్న బాధ.

''అలిగితిని నీపయిన్, ప్రియురాల! నేను,
అదియు నా వెఱ్ఱిలో నొక అంగమగును.''

నీమీద నేను అలిగినాను. నీవు నామీద అలుగుట న్యాయంగాని నేను నీమీద అలగడం ఏమిటి నా పిచ్చిగాక?

''ఎవ్వరేని నాగాథ వచింప నామె
వినును చక్కగా; ననుగూర్చి అన వాకింప.''

ఎవరైనా నాగాథను ఆమెకు చెబితే వింటుందిగాని, నోరు విప్పి అయ్యో! అని అనదు. విని ఊరుకుంటుంది. ఎంత కఠినురాలు!

''గాలిబా! ఆమెతో చెప్పగలము నీదు
వ్యథను గూరిచి, నీ గుండెవంత గూర్చి;
కాని అంతమాత్రమున తా కనికరించి
చేరవచ్చు నటన్నది చెప్పలేము.''

''గాలిబ్! నీ బాధను మేము ఆమెకు చెప్పగలం కాని అంతమాత్రాన

ఆమె మనస్సు కరిగి నీ వద్దకు వస్తుందనేది నువ్వు చెప్పలేవు". అయినా ఆమె అంత కఠినంగా ఉన్నమాట.

''సౌభాగ్యమును గోరి బంధువైనాను వినదటయేమను ?
లోకమెల్లను మరచినగోడుదును నేను.''

మధువు పుచ్చుకోవడి సుఖంకోసంకాదు. ఉన్న దుఃఖాన్ని మరచిపోవడానికి పుచ్చుకుంటున్నాను. ఈ దుఃఖభరితమైన లోకాన్ని మరువడానికి మధువు సేవిస్తున్నాను.

''కఠిన శిలవంటి హృదయము గలుగు దాన!
తల పగులగొట్టుకొనుటయే తలపులైన
నీ గృహంద్వార బంధ సన్నిష్ఠ శిలనె
తల పగులగొట్టుకొనియెడి తలపు లేల ?''

ఆమె కఠినశిలవంటి హృదయం గలది. కనుక తాను ఎంత బాధపడినా కనికరించదు. కాగా ఇక బాధ భరించలేక తల పగులగొట్టుకోవలసివస్తే ఉన్నట్లయితే ఆమె ఇంటిగుమ్మపు రాతితో తలపగులగొట్టుకోడం దేనికి? ఏ రాతితో నైనా కొట్టుకోవచ్చు. కాని ఆ రాతితో తల పగులగొట్టుకోవాలనే కోర్కె కలుగుతున్నది. వచ్చినా ఆమె ఇంటిముందే చావాలి.

''నావలెనె దుర్దినములున్న నరుడు లోకంబు
రేయినే పగలనుకున్న పోయెనేమి ?''

దుఃఖాలుగ్రస్తమైన పగలునూ, దుఃఖాలున్న రోజునూ దుర్దినం అంటాం. దుర్దినం నాడు ఎవరైనా నావంటివాడు రాత్రిని పగలనుకుంటే తప్పేమిటని అని అడుగుతున్నాడు. ఎందుకంటే, చీకట్లుక్రమ్ముకొన్న పగలు, రాత్రి ఒకటిగానే ఉన్నవి. కాగా పగలును రాత్రి అనుకున్నా, రాత్రినే పగలనుకున్నా ఒకటే. రెండూ, మేఘాచ్ఛన్నమై అంధకారం ఉంటుందలే. అయితే గాలిబ్‌లోని చమత్కారం చూడండి. "పగలును రాత్రి అనుకోవడంలో ఏంపోయింది" అనటానికి బదులు "రాత్రిని పగలనుకుంటే ఏంపోయింది" అని తలక్రిందులుగా పలికి చమత్కరిస్తున్నాడు.

''బ్రతికినన్ని నాళ్ళు వెతలు తప్పవుకదా !
మృతియె వెతలదీర్చు వేళ వుండు''

దుఃఖాలను పోగొట్టే మంచిమందు మృత్యువొక్కటేనట !

"ఆమె తనను గూర్చి అతిగర్వపడుచుండెను
తాన పిలువబోదు తాను నన్ను,
నేను స్వాభిమాన నిరతుడ గావున
పిలువకుండ పోను, కలియు టెట్లు?"

గర్వాంగన ఆమె తనంత తాను నన్ను రమ్మనదు. స్వాభిమానం గల నేను పిలవనిదే పోను. ఇక మేమిద్దరం కలుసుకోవడం ఎలా?

"కత్తి చేత లేక కదనమ్ము జరిపెడి
ఇంతి కెవ్వ డసువు లీయకుండు?"

ఆమె ప్రియునితో యుద్ధం చేస్తుంది. కత్తిమాత్రం లేదు. సేనలు శూలాల తోనో, హృదయంతోనో, వలపులతోనో యుద్ధం జరుపుతుంది. అలాంటి దానికి ప్రాణాలు అర్పించకుండా ఎవడుండగలడు? అనగా ఎవడైనా ఆమెకు ఓడి తన ప్రాణాలు సమర్పిస్తాడు. నిజంగా కత్తిపట్టుకుని యుద్ధానికి వస్తే వారితో కత్తితో పోరాడి గెలువవచ్చు. కాని ఆమె కత్తిలేకుండా కదనం జరుపుతుంది!

"లోకమందును సుఖము శోకమ్ము కల వండ్రు
శోకమనసె ఇచ్చె నాకు బ్రహ్మ."

లోకంలో సుఖాలు, దుఃఖాలు రెండూ ఉంటూ యుంటాయి గాని నాకు సుఖాలు ఎన్నడూ లభించలేదు. దుఃఖితమనస్సునే బ్రహ్మ నాకు ప్రసాదించినాడు.

"ప్రళయము ముందెగాని తలప నద్ది వియోగ
రాత్రికన్న దుర్భరమ్ము గాదు."

అంతా ప్రళయమంటే చాలా దుర్భరమైనదనుకుంటారు. అది నిజమే. ప్రళయం దుర్భరమే. కాని వియోగరాత్రికన్న దుర్భరం మాత్రం కాదు. అనగా వియోగరాత్రి ప్రళయంకన్న దుర్భరము అని.

"పరుల తీపి మాటలకు లోబడెను తాను,
నోరులేని నన్నాయమ చేరనీదు."

తియ్యతియ్యని మాటలు చెప్పి దగా చేసేవాళ్ళకు లోబడింది గాని, నిజంగా ప్రేమించినవాడంటి నోరులేనివాణ్ణి దగ్గరకు చేరనీయదు.

ఈ విధంగా ఉదాహరణలు చూపుతూపోతే ఎన్నైనా చూపవచ్చు. దీన్ని నేను స్వాదు వేదన అంటాను. విరహాతురమైన గాలిబ్ మనస్సు వేలు

సరించిన మాటలు ఎంత వేదనాభరితములో అంత స్వాదువులు. ప్రియురాలి పరిష్వంగంవలన కలిగిన ఆనందంకంటే ఆమె వియోగంవలన కలిగిన విషాదమే ఎక్కువ హృదయసంతాపకారిగా వుంటుంది. కటు రమ్యమైన వేదన గాలిబ్‌ది. అతని శృంగారవర్ణన ఉపరిబాహ్యది కాదు. గంభీరమైనది. ఉదాత్తమైనది. ఆయన బోధ మన బాహ్యంగా గోచరించి మనను గజలోలుపులను చేస్తుంది.

ఉరుదూలోను, ఫారసీలోను తనకంటె పూర్వులు పోని ఈ మార్గాన్ని అనుసరించినాడు గాలిబ్. అతని వేదన పవిత్రమైనది.

గాలిబ్ గొప్ప మానవతావాది. ఆధ్యాత్మికుడుగానూ మానవత్వం అతని కవితలో తొణికిసలాడుతుంది. సాధారణ శాశ్వతసత్యాలను అతడు వ్యాఖ్యానిస్తాడు. ఆ కొన్ని శాస్త్రాన్ని తాను అనుభవించి దాని వలన కలిగిన అనుభూతిని ఎంతో సరళంగా అభివ్యక్తం చేస్తాడు.

"స్వీయలోపమ్ము లెరుగుట పెద్దవిద్దె,
లోప మెరిగినవాడె పూర్ణుడగు నరుడు."

తన స్వభావాన్ని ఇంత సరళంగా చెప్పటం చాలా కష్టం. అన్నివిద్యలలోకీ పెద్దది తన లోపాలను తాను తెలిసికోవటం. లోపాలను తెలుసుకున్నవాడే పూర్ణుడట! లోపం లేనివాడు పూర్ణుడు అని సాధారణంగా తలుస్తాడు. మహాకవి గాలిబ్ ఇలా చెప్పడు. అతనికి తెలుసు మానవుడెంతవాడైనా లోపం లేకుండా వుండడు. అయితే లోపం తెలిసికొనినవాడు గర్వించడు. జాగ్రత్తగా మెలగుతాడు. వాడే పూర్ణుడు.

"ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము
నరునకు నరుడౌట యెంతో దుష్కరము సుమ్ము."

ప్రతిపని సులభంగా జరుగుతుందనుకోవడం పొరపాటు. చిన్న చిన్న పనులు ఎంతో కష్టంగాని జరుగుతాయి. ఉదాహరణకు నరుడు నరుడవడమే వుంది. అది చాలా చిన్నపని అనుకుంటాం. కాని అది అంత సులభసాధ్యమా? రెండు కాళ్ళు, రెండు చేతులు ఉన్నవాడల్లా నరుడేనా? దయామయుడు, గంభీరుడు, ఉత్తమగుణసమన్వితుడు, స్నేహశీలి, పరోపకారపరాయణుడు అయినవాడే నిజమైన నరుడు. ఈ గుణాలు ప్రతి నరునిలోనూ కానవస్తాయా? ఇవన్నీ కల వాడు కోటికొక్కడు. కనుక మానవుడు మానవుడు కావడం సులభసాధ్య మనుకోకండి. చాలా దుస్సాధ్యమైన విషయం అని బోధిస్తున్నాడు మహాకవి గాలిబ్ ఈ పద్యంలో

"స్మృతి నెఱుంగని ఒంటిదేవతలకన్న
నలుగురికి మేలుచేసెడి నరుడె మిన్న"

దేవతలకు స్మృతి లేదు. వారు చేసేదీ, చేయవలసిందీ ఏమీ లేదు. పైగా వారు తాము చూచుకొని ఒంటరిగా కాలం గడుపుతారు. మానవులు నలుగురి మేలును కోరి ఎవరో ఒకరికి ఉపకారులు అవుతారు. కనుక నరుడే నయం.

"చేసినట్టి పాపములకు శిక్ష యున్న
పాపములు చేయనందుకు వలదు రక్ష."

పాపాలు చేస్తే శిక్షిస్తారు గాని చేయని పాపాలకు ఏమైనా మెచ్చి రక్ష ఇస్తారా? ఇవ్వరు. శిక్షించేవాళ్లు రక్షించాలి కూడా.

"'అస్తి' యని దగా చెందకు మయ్యా! నీవు.
వసుధపై నెంచిచూడ సర్వమ్ము 'నాస్తి'."

లోకంలో ఏదో వుందని దగాపడి దానికోసం తాపత్రయపడకు. లోకంలో అంతా 'నాస్తి'. ఎక్కడా ఏమీ లేదు. అంతా మాయామయం.

మహితకస్తూరికాపరిమళము జిమ్ము
సరస మధుధారకై గదా స్వర్గవాంఛ!"

స్వర్గాన్ని కోరి జపతపాలు చేసే వీరంతా కాంక్షించేమిటి? కస్తూరీపరిమళంతో ఘుమ ఘుమలాడే మధువునే గదా! ఆ వాంఛయే వీరిచేత ఈ జపతపాలు చేయిస్తున్నది. "స్వర్గంలో ఏమీ లేదు, అసలు స్వర్గమే లేదు" అనండి, నూటికి తొంభై తొమ్మండుగురు భక్తులు జపతపాలు మానుకుంటారు అంటాడు గాలిబ్. అందుకే ఒకచోట అన్నాడు—"ఈ స్వర్గాన్ని ఎవరైనా నరకంలో తోసేస్తే బాగుండును. స్వర్గంమీది కాంక్షతో భగవత్ భజనలు చేసే చాలా మంది మానుకుంటారు" అని.

"స్వర్గమునుగూర్చి నాకు సర్వమ్ము తెలియు
మనసు సంతసపడుటకు మంచి ఊహ."

అసలు స్వర్గం లేనే లేదు. ఏదో మనస్సుకు సంతోషం కలగ దానికి ఇదో కల్పన, అంటున్నాడు.

"అందకత్తెల సాహచర్యమ్మునందు
కొద్దినాళులు గడపినగూడ చాలు.

"మనిషి ఏకాకియైనను మనసులోన
గుంపులుగ భావములు చేరి గోష్ఠి జరుపు."

మనిషి ఒంటరి అయినా వాని మనసులో అనేక భావాలు. రకరకాల ఆలోచనలు. అవి అన్నీ చేరి అనుక్షణం గోష్ఠి జరుపుతుంటాయి.

"వెతల నోర్చుమేని వెత లంతమగును,
సులభమగు నలభ్యములును గాన."

కష్టాలు సహించగలిగితే అవి వాటంతటఅవే పోతాయి. అలభ్యాలు కూడా సులభంగా దొరుకుతాయి. సహించడం అంటే కష్టాలను గెలిచే మార్గం. సహనంవల్ల అసాధ్యములు సుసాధ్యము లవుతాయి.

"వలపు లేనాటికేని నిష్ఫలము కాదు,
కాయ కాయని వృక్షమ్ము కాదు వలపు."

ప్రస్తుతం నిష్ఫలంగా తోచినా ఏనాటికైనా వలపులు ఫలిస్తాయి. కాయక కాయని వట్టి ఛాయాతరువులవంటిది కాదు వలపు.

"బిందు వణగారి సింధువై వెలసినట్లు
రుజయు పెంపొంది ఔషధరూప మందు."

ఒక్క నీటిచుక్క కలిసిపోయి సముద్రమంత అవుతుంది. రోగం ముదిరి హెచ్చి తానే ఔషధం అవుతుంది. జబ్బుకు జబ్బే మందు కావడం అనగా మృతి కలగడం.

ఎంత వేదన వెళ్ళబోసినా గాలిబ్ కొన్నికొన్ని తావుల మనసు నవ్విస్తాడు. నర్మహాస్యం ప్రయోగించిన పట్టులను పరిశీలింతాం.

"గుండె దొంగిలించుకొనిపోయె హాయిగా
ముద్దొసంగ వెనుకముందు లాడు!"

ఎట్టి జంకూ గొంకూ లేకుండా నా హృదయాన్ని దొంగిలించుకొని వెళ్లిపోయింది గాని ముద్దొసగుటకు వెనుకముందులాడుతుంటుంది!

"నేను మరణింప నాయింటిలోన మిగిలె
ప్రేయసుల చిత్రములును, లేఖ లంతె."

ఆమెయొక్క అతిలోకసౌందర్యం, అందులోనూ నేను కల్పించనేదం నా మిత్రుణ్ణే నాకు శత్రువునిగా మార్చింది.

"కయిని శక్తి లేదు, కన్నుల బల మున్న
దింక పానపాత్ర నెదుట నిడుము."

అతిగా త్రాగినాడు. పానపాత్రను చేతితో ఎత్తిపుచ్చుకునే శక్తిలేదు. అయినా ఇంకా పానపాత్రవైపు చూసే శక్తి కాస్తవున్నది. కనుక అక్కడే పాన పాత్రను తీసుకుపోకు. నా కళ్ళముందుండనీ. త్రాగకున్నా, చూసి ఆనందిస్తుం టాను అంటాడు.

"పానశాల యేడ? భక్తుని ఇల్లేడ?
నేను వెడలుచుండ తాను జొచ్చె."

పానశాలకూ భగవద్భక్తుని ఇంటికీ చాలాదూరం. కాని వాడు దొంగచాటుగా పానశాలకు వస్తూంటాడు. ఒకనాడు నేను పానశాలలోనుంచి బయటికి వెళ్ళు తున్నాను. అతను లోపలికి చొచ్చుతున్నాడు! ఇది కపటభక్తుల పని.

"ఇతరులు త్వదీయచషకమ్ము నెంగిలింప
పెదవులార నీవార్తకై ఎదురుచూతు."

ప్రియురాలా! నీవు అందిచ్చే మదిరాచషకాన్ని అన్యులు ఎంగిలిస్తుంటూ వుండగా నీవు నన్ను రమ్మంటావనే వార్తకోసం నేను పెదవులారిపోగా ఎదురు చూస్తున్నాను.

"స్వర్గమున తేనెధారల బడయగోరి
వసుధపై మద్యపానము వదలె దేల?
ఈగ లెన్నెన్నియో ఎంగిలించినట్టి
తేనెగా దిది స్వచ్ఛమాధ్వీక మోయి!"

భూలోకంలో మద్యపానంవంటి పాపకార్యాలు చేయకుండా పవిత్రులుగా ఉన్న దైవభక్తులకు స్వర్గంలో తేనెధారలు లభిస్తాయని ఒక మతవాదం. గాలిబ్ అంటాడు— "స్వర్గంలో తేనె సాధించడంకోసం ఈ లోకంలోని మధువు వదలుకుంటావేమయ్యా! స్వర్గంలో తేనె ఈగల ఎంగిలికలసిన తయా రైనది. భూలోకంలో లభించే మదిర స్వచ్ఛమైన ఇక్షుఫలాలలోనుండి వెడలి నది. కాన ఆ ఈగల ఎంగిలికన్న ఇది మంచిది. దీన్నే అనుభవించు"—అని.

"దుఃఖములు ధీరులకు నొక్క ప్రకటిసినట్లు,
వైద్యుతాగ్నితో శోకదీపంబు వెలుగు."

దుఃఖం ఉన్నమాట నిజమే. కాని ఆ దుఃఖంలో ధీరులు ఎలా ప్రవర్తిస్తారు. ప్రకృతిలో దాన్ని తెలుసుకోవచ్చును. మేఘాల్లోని మెరుపులతో శోకదీపాన్ని వెలిగిస్తారు. అనగా శోకంలో కూడా ధైర్యంగా ఉంటారని.

"లాగి విడిచిన బాణంబులాగు నడచు
పడతి యెదలోన స్థాన మేర్పరచుకొనుము."

మందకొడిగా వుండేది కాదంటావా, లాగివిడిచిన బాణంలాగ సూటిగా వెళ్ళి పడతి హృదయంలో స్థానం ఏర్పరచుకో. ఎన్ని బాధలు వచ్చినాసరే నిలదొక్కుకో.

"హింస భరియించు శక్తి నార్జించె మనసు
ఇంక నా క్రూరురాలి వరింతు నేను."

ఆమె ఎంతహింసపెట్టినా ఇక నిరాశపడను. భరించే శక్తి మనస్సుకు కలిగింది. కనుక భయపడి వెనక్కిపోక ఆ క్రూరురాలిని వరించి సాధించి తీరుతాను.

"గుండియ వియోగవహ్నిలో మండిపోయె.
కాని సంయోగవాంఛను మానలేదు."

వియోగాగ్నిలో గుండె మండిపోయినా నిరాశపడక సంయోగ వాంఛను కలిగియున్నాను. కార్యదీక్షాపరులు వైఫల్యాలకు జడిసి వెనుదీయరు.

"జ్వాలయే దీపమునకు సర్వస్వమట్లు
ప్రణయమే జీవితంపు సర్వస్వమయ్యె.

* * * *

నన్ను కవ్వించబోకు, నా కన్నులందు
అశ్రుఝంఝామరుత్ సమూహాలు కలవు.

* * * *

మధువు గ్రోలి రాగిల్లిన వధువు మోము
చూడగోరె నా వెచ్చని చూపు లిపుడు.

దేవి! నా తోటి బంధమ్ము త్రెంచబోకు,
స్నేహము లేకున్న, ఉండనీ ద్వేష మేని.

* * * *

నా రోదనానికి గిన్నెలు పదును బోసి
సాధువుల బాధ పెట్టుటకే విధ మదేల?
దేవి! మధుపూర్ణ భాండమే తెచ్చి నాదు
నోటి కందీయరాదె! సంతోషపడెద.

* * * *

అస్త్రదళముల గలవు గాయాల పూలు,
వధ్యశిల నేగెదను హాసవదనమునను.''

గాయాలను పూలుగా భావించి వధ్యశిలకు నవ్వు ముఖంతో వెళ్ళగలిగిన ధైర్యశాలిత్వాన్ని కవితలో ప్రదర్శించినాడు గాలిబ్. అతడు చాలా నవ్యుడు. ఎన్నడూ ప్రాచీన సిద్ధాంతాలకు కట్టుబడియుండలేదు.

గాలిబ్ రచనల్లోని మరో విశేషం — ప్రతిపాఠకునికీ తన హృదయం గాలిబ్ రచనల్లో కనపడడం. మానవస్వభావంలోని వివిధ రహస్యాలూ వీటిలో ద్యోతకమౌతాయి. గాలిబ్ వేదన ఆరోగ్యవంతుడైనవాని వేదన. వేదనాభరితమైన ఆయన గీతాలలోని శబ్దాలు సాధారణార్థాన్ని దాటి విస్తృతార్థాన్నిస్తాయి. భావుకులైనవారికి బహుళార్థద్యోతకములైన గాలిబ్ పద్యాలు మరింత హృద్యంగా వుంటాయి. సమర్థుడైన కవి వాడిన శబ్దం సాధారణార్థాన్ని మించిన అర్థాన్నిస్తుంది. కరెన్సీనోటు సాధారణమైన కాగితంలో చేయబడినదే. అయినా వట్టి కాగితం కంటే ఎన్నోరెట్లు ఎక్కువ విలువ కలిగివుంటుంది. అలాగే గాలిబ్ వాడిన పదాలు గంభీరార్థాలను ఇస్తాయి. అసలు శబ్దాలకు అందని అత్యున్నతభావాలను గాలిబ్ వ్యక్తపరచినప్పుడు వాటిని హృదయంతో ఆస్వాదించవలసిందేగాని నిఘంటువుల సహాయంతో రుచిచూడలేం.

నిఘంటువులకు, నియమనిబంధనలకు అతీతమైన గాలిబ్ అమృతకవితలోని అనన్యసామాన్యమైన వైభవం ఆయనజీవితంలో కూడా కనిపిస్తుంది.

అన్నాడు— "జైలునుంచి విడుదలైన వెధవ ఎవడయ్యా! మొన్నటిదాకా తెల్లవాడి జైల్లో ఉన్నాను. ఇప్పుడు నల్లవాడి జైల్లో ఉన్నాను" అని. తాను ఏమిత్రుడింట్లో వున్నాడో అతని పేరు కాలేమియా. 'కాలా' అనగా నల్లని వాడు అని అర్థం. తెల్లవాని జైలు తప్పెగాని నల్లవాని ఇంట్లో నిర్బంధంగా ఉంటున్నాను అని హాస్యోక్తి విసరినాడు. మరొకరైతే జైల్లో పడ్డందుకు సిగ్గుపడి కొన్నాళ్ళు ఇతర్లకు కనపడేవాళ్ళు కారు. గాలిబ్ తాను నవ్వుతూ కాలం గడపడమేగాక ఇతరులను నవ్వించేవాడు.

ఢిల్లీని పరిపాలించిన మొగల్ వంశపు రాజులలో తుదివాడైన బహదుర్ షా జఫర్ ఆస్థానంలో పండితునిగా, కవిగా కొంతకాలం ఉన్నాడు. తైమూరు వంశ చరిత్ర గ్రంథం రాయడానికి గాలిబ్‌ను నియమించినాడు రాజు. బహదుర్ షా స్వయంగా కవి. అతని పద్యాలను సరిదిద్దడంకూడా చేస్తుండేవాడు గాలిబ్. ఒకనాడు రాజు ఏవో కొన్ని పద్యపాదాలుమాత్రమే వ్రాసి మిగతావి పూరించి సరిదిద్ది సంపూర్ణం చేయవలసిందిగా కోరాడు. వెంటనే చకచకా వాటిని పూర్తిచేసి సవరించి పంపాడు గాలిబ్. క్షణంలో ఆశువుగా చెప్పినంత వేగంగా పద్యం రచించేవాడు గాలిబ్.

ఇంగ్లీషువారు 'బహదుర్' రాజును గద్దెదించినతరువాత చాలా ఇబ్బందులు పడ్డాడు గాలిబ్. 1857 విప్లవం దేశాన్ని అల్లకల్లోలం చేసింది. దేశభక్తులైన వారిని ఇంగ్లీషువారు చిత్రహింసలపాలు చేశారు. ఢిల్లీలో కొన్నినెలలపాటు ప్రజాజీవితం స్తంభించిపోయింది. ఒక ఇంటినుంచి ఇంకొక ఇంటికి వెళ్ళే వీలు లేదు. మార్కెట్లన్నీ మూతపడ్డవి. ఇంగ్లీషు సైనికులు ఇళ్ళలో జొరబడి, విప్లవ వాదులకు సహాయం చేశారంటూ ఎవర్నిపడితే వాళ్ళని పట్టుకపోయి నిర్బంధంలో ఉంచేవారు. హింసించేవారు. గాలిబ్‌కు దమ్మిడీఆదాయం లేదు. నానాఇబ్బందుల్లో వున్నాడు. గాలిబ్ సోదరుడు "యూసుఫ్ ఖాన్" చిన్ననాటినుంచే పిచ్చివాడు. ఎన్నిచికిత్సలు చేయించినా అతని పిచ్చి తగ్గలేదు. అతడు చాలా దినాలకు 1857 విప్లవంరోజుల్లో మరణించాడు. శవానికి కప్పడానికి నాలుగుగజాల గుడ్డ లభించలేదు. దుకాణాలన్నీ మూసి వున్నాయి. ఎటుచూచినా సైనికులు. ఇళ్ళల్లోనుంచి బయటకుపోయే వీలు లేదు. ఖననకర్మకు మనుష్యులు దొరకలేదు. శవాన్ని మోసేవాళ్ళు కరువైనారు. మిత్రుల సహాయంతో గాలిబ్ ఎలాగో సోదరుని అంత్యక్రియలు చేశాడు.

1857 విప్లవజ్వాలలు శమించిన తరువాత రాంపూర్ నవాబు గాలిబ్‌కు నెలకు నూరు రూపాయలు జీతంగా ఇచ్చేవాడు. ఆజీతంలోనే కాలక్షేపం చేసేవాడు గాలిబ్.

గాలిబ్ ఎంత కవో అంత పండితుడు. "బుర్హాన్ ఖాతే" అనే నిఘంటువులోని లోపాలను చూపుతూ "ఖాతేబుర్హాన్" రచించాడు. అతని

పంక్తులూ ఎంతో ఆత్మభావంతో శ్రోతల హృదయాలలోకి చొచ్చుకుని పోతాయి. కనుక ఉరుదూ కవితలో ఉన్నంత క్లుప్తత, గుప్తత, ఆప్తత మరే భాషలోనూ కనిపించదు. కవి తాను రచించిన రెండు పంక్తుల పద్యం చదివేసరికి శ్రోతలు, హృదయాలుప్పొంగి "వహ్వా" అని తమ ఆనందాన్ని వ్యక్తపరచందే ఉండలేరు. లాగివదలిన బాణంలా ఆ పద్యం గుండెలోకి దూరబడి తనపని చేస్తుంది. ఇది అన్యభాషల్లో లేదు. ఒక చిన్న భావాన్ని పదిహేన్నెండు పద్యాల్లోగాని మనం పూర్తిచేయలేం. Brevity కి ఫారసీ, ఉరుదూ భాషలు పెట్టినది పేరు.

ఇట్టి ముషాయిరాలు ఢిల్లీలో రాజదర్బారుల్లో చాలా వైభవోపేతంగా జరుగుతుండేవి. రాజుల దర్బారుల్లోనేగాక అన్యత్రాకూడా జరిగేవి. వాటిల్లో గాలిబ్ పాల్గొనేవాడు. చాలా మనోహరంగా తన కవితను వినిపించేవాడు. అయితే సన్నాయి, సన్నెల పెట్టుకుని పాట పాడేవా డసలు కాదు. భావం విశదపడేట్టు పక్కాగా పఠించేవాడు. ఆయన తన కవితను తాను పఠించగా విని జనులు ఎంతో ఆనందించేవారు.

ఒకరాత్రి ఢిల్లీలో ముషాయిరా జరిగింది. రాత్రి సాంతం కవిత వింటూ కూర్చున్నారు సహృదయులు. అనేక కవులు తమ కవిత చదివారు. గాలిబ్ చదవవలసిన సమయానికి ఇంచుమించు తెల్లవారింది. "ఇప్పుడు నేను 'భైరవీరాగం' ఆలాపిస్తాను" అంటూ "సబీరోదస" అనే రీతి గల ఫారసీ కవిత వినిపించాడు. ఆయన ఆ కవిత వినిపిస్తున్నంతసేపూ శ్రోతలు, హృదయాలు ద్రవించి కన్నీరు కారుస్తూ కూర్చున్నారు. కొందరు వెక్కి వెక్కి రోదించారు. అప్పుడే వర్షం కూడా కురిసింది. సభ్యులలోనుండి ఒకరు లేచి "ఆస్మాన్ హం గరీస్త్"—ఆకాశం కూడా కన్నీరు కారుస్తున్నది అన్నాడట. వేదనా భరితమైన గాలిబ్ కవిత కరిగించని హృదయం లేనేలేదు. "పాషాణాదపి పీయూషం స్యందతే" అన్నట్లు కఠిన హృదయాలు సైతం కరిగి కాల్వలు కట్టే రీతిని కవిత రచించినాడు గాలిబ్.

మహాకవి గాలిబ్ కు భారతదేశంలోని నలుమూలలనుండి వేలాదిజనం లేఖలు వ్రాసేవారు. అనేక విషయాలను గూర్చి ప్రశ్నిస్తూ ఉంటూండేది ఆ లేఖల్లో. ఎన్ని పనులున్నా, ఎన్ని చిక్కులున్నా, ఎంత విచారంగా వున్నా, ఎంత అనారోగ్యంగావున్నా అన్ని ఉత్తరాలకూ తప్పనిసరిగా జవాబు ఇచ్చేవాడు. జవాబుకోసం కవర్లలో స్టాంపులు పెట్టి ఎవరైనా పంపితే చాలా కోపపడేవాడు. 'నాట్ పేయిడ్' ఉత్తరాలు వచ్చినా తిరగగొట్టక, డబ్బు చెల్లించి వాటిని తీసుకుని జవాబు ఇచ్చేవాడు. గాలిబ్ తో పద్యాలు దిద్దించుకోవాలని చాలామంది అభిలాష. కనుక అనేకులు పద్యాలు దిద్దడానికి పంపేవారు. కళ్లు కనపడని వృద్ధాప్యంలోనూ, స్వయంగా వ్రాయ

చాలనివాడునన్నా ఇతరుల సహాయంతో లేఖలకు జవాబులు పంపేవాడు. ఓపికగా పద్యాలు దిద్ది పంపించేవాడు. కాని మరీ వృద్ధుడయిపోయి మనస్స్థిమితం మరీ తగ్గిపోయినాక "ఇక దిద్దడానికి పద్యాలు పంపకండి. నాకు విశ్రాంతి నివ్వండి" అని విజ్ఞప్తి చేశాడు. అయినా జనం పద్యాలుపంపి దిద్దమని వేధిస్తుండేవారు. "మంచి భార్య చెడు భర్తతో విధిలేక కాలంగడిపి నట్లు, చేతగాకున్నా పద్యాలు దిద్దుతున్నాను" అన్నాడట ఒకసారి గాలిబ్

తన ఆదాయం ఎంత తక్కువైనా, పేదలకు చేతనైనసహాయం చేసేవాడు. జీతం లేనినాడుకూడా ఇంట్లో పనివాళ్లను తొలగించలేదు. గాలిబ్ ఇంటి ముందు కుంటివాళ్ళు, గుడ్డివాళ్లు ఎప్పుడూ ఉంటుండేవారు. వాళ్ళకు తిండిపెట్టడం, బట్టయివ్వడం మానుకోలేదు. ఇవ్వడానికి అతని చేయి ఎన్నడూ వెనుతీయలేదు. పేదకవుల పద్యాలు దిద్దిపెట్టడమేగాక వారికి వీలైనంత ఆర్థిక సహాయంకూడ చేసేవాడు. వారిని ప్రోత్సహించేవాడు. అవకాశం దొరికినప్పుడల్లా వాళ్ళకు ఎక్కడో ఒకచోట ఆశ్రయం ఏర్పాటు చేసేవాడు.

ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ ఒకసారి గాలిబ్‌ను ఆహ్వానించి దర్బారులో వివిధ ఆభరణాలతో, శాలువలతో గౌరవించి బిరుదులు ప్రదానంచేశాడు. ఖిలాఖతులు పొందగానే గవర్నర్‌గారి బంట్రోతులు "ఇనాం" ఇమ్మని గాలిబ్ ఇంటికి వచ్చారు. గాలిబ్ వద్ద డబ్బులేదు. వెంటనే ఆ ఆభరణాలను అమ్మించి బంట్రోతులకు ఇనాం ఇచ్చి పంపించాడట.

గాలిబ్ మిత్రుడొకడు, బాగా బతికినవాడు, దౌర్భాగ్యవశాన చితికి పోయి దారిద్ర్యంవల్ల దీనావస్థలో వున్నాడు. అతడు పట్టుకమీజులకు బదులు చాలా చవకరకపు చీటిగుడ్డతో అంగరఖా కుట్టించుకుని తొడుక్కుంటున్నాడు. చీటిగుడ్డఅంగరఖా తొడుక్కుని అతను గాలిబ్ ఇంటికి వచ్చాడు. అది చూచి గాలిబ్ మనస్సు చివుక్కుమన్నది. "నాయనా! ఈ పలచని అంగరఖా బాగుందోయ్. నా కిస్తావా? ఎండకాలం తొడుక్కుంటే హాయిగా వుంటుంది" అని అడిగాడు గాలిబ్. "ఓ, దానికేం తీసుకో" అన్నా డామిత్రుడు. "అది సరేగాని నీ అంగరఖా నా కిచ్చి వొంటిమీద బట్టలేకుండా ఇంటికి వెళతావా? ఇదిగో, ఈ పట్టు షేర్వానీ తొడుక్కో" అని తన విలువైన జరీ షేర్వాని అతనికి తొడిగించి ఆ అంగరఖా తా నుంచుకున్నాడు.

మిత్రులంటే గాలిబ్‌కు చెప్పరాని ప్రీతి. నలుగురు మిత్రులతో కలసి కాలం గడపడంకన్న ధన్యత మరొకటి లేదనుకునేవాడు. భార్య, ఇల్లు, వాకిలి, డబ్బు, ఉద్యోగం సమస్తం మరిచేవాడు మిత్రుల సమక్షంలో. మిత్రుల కోసం ఏమైనా చేసేవాడు. "ఇతరులు బిచ్చమెత్తడం నేను చూడలేను. కావా లంటే ఇతరులకోసం నేను బిచ్చమెత్తుతాను" అన్నాడు గాలిబ్

గాలిబ్ జ్ఞాపకశక్తి అద్వితీయమైనది. ఒకసారి ఒక పుస్తకం చదివాడంటే అందులోని విషయాలను జన్మలో మళ్ళీ మరిచేవాడు కాదు. ఎప్పుడంటే అప్పుడు వాటిని ఉదహరించగలిగేవాడు. ఇంట్లో ఒక్క పుస్తకం ఉండేది కాదు. ఎక్కడినించైనా తెచ్చుకుని చదివి ఇచ్చేసేవాడు. ఏదైనా ప్రయోగానికి ప్రాచీనకవుల రచనలనుండి ఉదాహరణలు ఇవ్వవలసివస్తే తడుముకోకుండా కనీసం పదిఉదాహరణలు గబగబా ఇచ్చేవాడు.

రాత్రిళ్ళు ఆలోచనాసమాధిలో ఉండేవాడు. ప్రతిఆలోచనా ఒక పద్యమై బయలువెడలేది. అయితే అప్పుడు వ్రాసుకునే వీలేకా, వ్యవధి లేక ఒక్కొక్క పద్యానికీ ఒక ముడిచొప్పున తన పాజామా 'నాడా'కు వేసేవాడు. తెల్లవారి ఆ ముడులను విప్పుతూ ఆ పద్యాలు జ్ఞాపకంచేసుకుని రాసుకునేవాడు. ఎంత జ్ఞాపకశక్తి! ఎంత జటిలమైన విషయమైనా సునిశితంగా పరిశీలించి, దాని లోతుల్లోకి దిగి తలస్పర్శిగా విమర్శించేవాడు.

గాలిబ్ టుమ్రీలు చాలా ప్రశస్తిని సంపాదించుకున్నవి. చాలా సన్నమైన హాస్యాన్ని ఒలుకుతాడు గాలిబ్.

ఒకనాడు రాజుగారివద్దకు వెళ్ళాడు, రమ్జాన్ పండుగ తరువాత. "ఎన్నాళ్ళు ఉపవాసం ఉన్నారు రమ్జాన్‌లో?" అని అడిగాడు రాజు. "ఒక్కనాడుఉండలేదు" అన్నాడు గాలిబ్. నెలరోజుల్లో ఒక్కరోజే ఉపవాసం ఉండలేదేమో అనుకున్నాడు రాజు. కాని "ఒక్కనాడూ ఉపవాసం ఉండలేదు! రోజూ సుష్టుగా భోంచేశాను" అని గాలిబ్ చెప్పదలచాడు. ఈ రెండు అర్థాలూ వచ్చే చిన్నమాట ఎంతో సమయస్ఫూర్తితో వేశాడు గాలిబ్.

రమ్జాన్ నెలలో అంతా ఉపవసించాలి. తాగరాదు, జూదాలు ఆడకూడదు. కాని గాలిబ్ మతవిరుద్ధమైన పనులన్నీ చేస్తూవుండేవాడు. ఒకనాడు జూదం ఆడుతుండగా ఒక మిత్రుడు చూచి, "ఏమయ్యా! రమ్జాన్ రోజుల్లో పాపపిశాచం కట్టుబడి ఖైదులో ఉంటుందంటారు. నీవు ఈ పాపిష్ఠి పని ఎలా చేస్తున్నావయ్యా" అని అడిగాడు.

"అవును నిజమే. రమ్జాన్ నెలలో పాపపిశాచం కట్టుబడి ఖైదులో వుంటుంది. మా ఇల్లే ఆ ఖైదు. కనుక జూదం ఆడుతున్నాను. పాపపిశాచం విచ్చలవిడిగా ఈ నెలలో తిరుగదు. అంతేకాని ఖైదులోనన్నా వుంటుండా వుండదా? చెప్పు" అని చమత్కరించాడు గాలిబ్

గాలిబ్‌కు మామిడిపళ్ళంటే చాలా ఇష్టం. మంచిమంచి పళ్ళు ఎక్కడ దొరుకుతాయని తెలిస్తే అక్కడినుంచి అడిగి తెప్పించుకునేవాడు. 'ఒకనాడు సాయంత్రంపూట రాజాగారివెంట మామిడి తోటలోకి షికారుకి వెళ్ళాడు. అది వైశాఖమాసం. చెట్లనిండా పండ్లున్నాయి. రకరకములో [illegible]

చూస్తున్నాడు గాలిబ్. "అంత దీక్షగా ఆ చెట్లవైపు ఎందుకు చూస్తున్నారు" అని అడిగాడు రాజా.

"నా తండ్రితాతల పేర్లు ఏ పండుమీదైనా కనపడతాయేమో అని చూస్తున్నాను" అన్నాడు గాలిబ్. అది గ్రహించి వెంటనే మంచిమంచి పండ్లు కోయించి బుట్టలనిండా గాలిబ్ ఇంటికి పంపినాడు రాజా. తన తండ్రి తాతల పేర్లు పండ్లమీద వుంటే వారసత్వంలో తనకు సంక్రమిస్తాయి. ఈ తోటలో ఇన్ని పండ్లున్నాయి. తనకు లభించేవి లేనేలేవా? అని గాలిబ్ చమత్కృతి.

మామిడిపళ్ల కాలంలో ఇంటినిండా మిత్రుల్ని కూచోపెట్టుకుని పండ్లు తినేవాడు గాలిబ్. ఒకనాడు మామిడిపండ్లంటే అసలు ఇష్టంలేని ఒక మిత్రుడు వచ్చాడు. అతనితో మాట్లాడుకుంటూ కూర్చున్నాడు గాలిబ్. ఇంటి ముందర మామిడిటెంకలు పడివున్నాయి. ఒక గాడిద అటునుంచి పోతూ, మామిడిటెంకను వాసనచూచి ముట్టకుండా వెళ్ళిపోయింది. మామిడిపండ్లంటే ఇష్టంలేని ఆయన అన్నాడు— "గాలిబ్! మామిడిపండ్లంటే నీవు అంత మురిసిపోతావు. గాడిదకూడా మామిడిపండు ముట్టడం లేదు చూడు" అని. అది విని గాలిబ్ అన్నాడు— "అవును నిజమే. గాడిదలు మామిడిపండ్లు ముట్టవు" అని. అతని ముఖం కత్తివేసినా నెత్తుటిచుక్క లేనంత వెలవెల పోయింది.

రోజూ రాత్రిపూట కొంచెంగా మధువు ఆరగించేవాడు గాలిబ్. అయితే దానికో కొలత వుండేది. మితంగా అంతే పుచ్చుకునేవాడు. సారాయిబుడ్లు దాచే పెట్టెతాళంచెవులు గుమాస్తావద్ద వుంచేవాడు. అడిగినా, నిర్ణయించుకున్న మితానికి మించి సారాయి ఇవ్వవద్దని అతనికి ఆదేశించాడు. తాగి ఆ మైకంలో 'ఇంకా తే, ఇంకా' తెమ్మనేవాడు. కాని ఆజ్ఞను అక్షరాలా పాటించే అనుయాయి గనుక అధికంగా మధువు ఇచ్చేవాడు కాదు. కాగా ఆ మత్తులో గాలిబ్ అతన్ని నానాతిట్లూ తిట్టేవాడు. అయినా అతను సహించి ఊరుకునేవాడు.

ఒకనాడు ఒక శిష్యుడు వచ్చి గాలిబ్ కాళ్లు పడతానన్నాడు. "నీవు ఎంత శిష్యుడవైనా సయ్యదువంశానికి చెందినవాడవు, మర్యాదస్తుడవు. కాళ్ళు పట్టడం మంచిది కాదు," అన్నాడు గాలిబ్. "కాళ్ళు నొప్పులుగా వున్నప్పుడు ఎవరితోనైనా పట్టించుకుంటారుగదా! నాతో కాళ్ళు పట్టించుకోండి. ఉచితంగా కాదు. తరువాత దానికి తగిన కూలీ ఇవ్వండి. ఇంక అందులో అపచారం ఏమీ వుండదు" అంటూ కాళ్ళునొక్కడం మొదలుపెట్టాడు అతను. నొక్కడం అయినాక "నా కూలీ నాకు ఇవ్వండి" అన్నాడతను. "నాయనా! నీవు కాళ్ళుపట్టావు, నేను డబ్బు బిగపట్టాను. దానికీ దానికీ సరిపోయింది" అన్నాడట గాలిబ్

మిత్రుడొకాయన గాలిబ్ ఇంటికి వచ్చాడు. చాలా రాత్రిదాకా మాట్లాడుతుంటూ కూర్చున్నారు. వెళ్ళేప్పుడు దీపం తీసుకుని వాకిట్లోదాకా వచ్చి చెప్పులు చూపించాడు గాలిబ్. "నా చెప్పులు నేను తొడుక్కోలేనా! దీపం ఎందుకూ" అన్నాడతను. "అది నిజమే. నీ చెప్పులు తొడుక్కోలేవని కాదు. నా చెప్పు లెక్కడ తొడుక్కుపోతావో అని దీపం తెచ్చాను" అన్నాడు గాలిబ్.

మిత్రుడు ఒకడు గాలిబ్ తాగుతున్నందుకు ఆక్షేపణగా అన్నాడు— "గాలిబ్! మద్యపానం పాపం కదూ! మద్యం పుచ్చుకునేవాని ప్రార్థనను భగవంతుడు అంగీకరించడు" అని. అది విని గాలిబ్ నవ్వి— "తాగడానికి మద్యం దొరికాక ఇంకా భగవంతుణ్ణి ప్రార్థించడం దేనికి?" అన్నాడు.

ఎండకాలం రాత్రిపూట ఆరుబయట మంచంలో పడుకుని ఆకాశంలోకి చూచాడు గాలిబ్. ఆకాశంనిండా చిందరవందరగా విరబోసి కనపడ్డాయి చుక్కలు. ఎవరిభయమూ లేకుండా స్వతంత్రుడైనవాడు తన ఇష్టం వచ్చినట్టు స్వేచ్ఛగా చేసే పనుల్లాగా క్రమరహితంగా విచ్చలవిడిగా పడివున్నాయి చుక్కలు అనుకున్నాడు గాలిబ్

ఇతరులను పిచ్చిపిచ్చిగా స్తుతించడం గాలిబ్ వల్ల కాకపోయేది. ప్రశంసా పద్యాలు వ్రాయడంలో కొందరు సిద్ధహస్తులుగా వుంటారు. గాలిబ్ ఈ విషయంలో వట్టి అసమర్థుడు. తన హృదయాన్ని కదిలించిన వస్తువుతప్ప అన్యమును మెచ్చుకునేవాడు కాడు. పొగడేవాడు కాడు. ఎంతవాడు రాసినా సరే, తనకు నచ్చని పద్యాన్ని ఎన్నటికీ 'బాగుంది' అనేవాడు కాడు. తన హృదయాన్ని స్పృశించి హాయిహాయి అనిపించని రచనకు చంకలుకొట్టే వాడు కాడు. తనకునచ్చితే మెచ్చుకోడానికి ఎన్నడూ వెనకాడేవాడుకాడు.

"జౌక్" అనే ఒక సుప్రసిద్ధకవికీ గాలిబ్ కూ ఎప్పుడూ పొసగేదికాదు. ఎప్పుడూ ఏవో అభిప్రాయభేదాలు, పోరుపులు ఉంటుండేవి. అయినా తనకు నచ్చిన పద్యం ఏదైనా జౌక్ రాస్తే ఉప్పొంగిపోయేవాడు గాలిబ్

"పెనుబాధ లోర్వక చనిపోదు నందువు
హృదయ మపుడుకు కలగ నెటు పోవ నెంతువు ?"

ఈ పద్యం "జౌక్" ది. ఎన్ని అభిప్రాయభేదా లున్నా, అన్నీ మరిచి ఈ పద్యానికి ఉప్పొంగిపోయినాడు గాలిబ్. "బాధలు భరించలేక వాటినుండి తప్పించుకోవడానికి చనిపోతా నంటావు; అప్పటికీ హృదయంలో కలత తగ్గకుంటే ఇంకెటు పోతావు? చావుకన్న అభయచోటు ఇంకోటి లేదుకదా? అప్పటికీ బాధలు పోకుంటే ఎటుపోతావు? బాధలు వచ్చినా తప్పుకో

పలాయనవాదం పనికిరాదు. బ్రతికుంటే ఎదిరించాలి" అన్న భావాన్ని ఈ పద్యంలో జౌఖ్ రమ్యంగా చెప్పినాడు. అది గాలిబ్‌కు నచ్చింది.

ఎంత చిన్నకవి అయినాసరే రచన బాగుంటే మెచ్చుకునేవాడు. ఒక శిష్యుడు సంస్కరణకోసం పంపిన పద్యాన్ని చదువుకుని మెచ్చుకుని అతని కో ఉత్తరం గాస్తూ "నీపద్యాన్ని చదివి ఈర్ష్యపడుతున్నాను. ఎంత మంచి పద్యం రాశావోయ్ !" అని దీవించాడు గాలిబ్

ఇక తన పద్యంలో ఎవరైనా లోపం చూపిస్తే, వెంటనే అంగీకరించే వాడు. ఆ లోపాన్ని సవరించుకునేవాడు.

"స్వీయలోపమ్ము లెరుగుట పెద్దవిద్దె;
లోప మెరిగినవాడె పూర్ణుడగు నరుడు"

అన్నాడు గాలిబ్.

ఇక, తనకు నచ్చని పని ఎవరైనా చేయమంటే - అతడు రాజైనాసరే - చేసేవాడు కాదు. తెలివిగా ఆ పనినుండి తప్పుకునేవాడు. ఎవరైనా చని పోతే వారినిగూర్చి అర్థ్యయనపద్యాలు రాయడం ఆరోజుల్లో ఆచారం. ఆ పద్యంలో ఆ చనిపోయిన వ్యక్తినిగూర్చి, చనిపోయిన తేదీ, నెల, సంవత్సరం సంకేతంగా ఇమిడేటట్లు కవులు పద్యాలు వ్రాస్తుండేవారు. వాటిని ఆ చనిపోయిన వ్యక్తికి చెందినవారు సమాధిశిలమీద చెక్కించేవారు.

చనిపోయినప్పుడే గాక, పిల్లలు పుట్టినప్పుడు, పిల్లల పుట్టినరోజు పండు గలకు పద్యాలు రాయించుకుంటారు కొందరు. గాలిబ్ ఈ రెండురకాల పద్యాలుకూడా రాసేవాడు కాదు. ఒకసారి ఒక పెద్దమనిషి, తన పిల్లవాడి పుట్టినరోజుసందర్భంలో పద్యం-రాయమన్నాడు. 'రాయను' అని సూటిగా అని అతన్ని నొప్పించడం ఇష్టంలేదు. కనుక ఒక చమత్కారం చేశాడు. "అమర్త్య ఎవరిపిల్లవానికో పుట్టినరోజున పద్యంరాసే వాడు పుటుక్కున చూపిరి వదిలాడు. నా రాతలు అచ్చిరావు. నాతో ఎందుకు రాయించు కుంటారు?" అన్నాడు. దానితో ఆ రాతపెడద వదలిపోయింది. [illegible] మని బలవంతం చేయడానికి ఇక వీలే లేకుండా జవాబిచ్చాడు గాలిబ్.

ఇలాటి చమత్కారఘట్టాలు గాలిబ్ జీవితంలో చాలా కనపడుతాయి.

ఒకసారి గాలిబ్ శిష్యుడు ఉమ్రావ్‌సింగ్‌కు రెండవసారి భార్యావియో గం కలిగింది. చిన్నచిన్న పిల్లలు. మళ్ళీ వివాహం చేసుకోవడి తప్పని దుస్థితి ఏర్పడిందంటూ గాలిబ్‌కు ఉత్తరం వచ్చింది. దానికి జవాబుగా గాలిబ్ శేఖ ఇలా వ్రాశాడు:

"ఉమ్రావ్ సింగ్‌కు అప్పుడే రెండవ పెళ్ళికర్మ పట్టిందా? నాకు ఇంకా రెండో పెళ్ళిభాగ్యమైనా పట్టలేదు"—అని. తన భార్య ఇంకా బతికేవుందనీ, అది చనిపోతే రెండవపెళ్ళి చేసుకునే వాణ్ణనీ ధ్వనించే వాక్యం విసిరాడు గాలిబ్ ఆ లేఖలో. దీనివల్ల గాలిబ్‌కు భార్యపై విసుగుపుట్టి రాసినట్లు అనిపించవచ్చుగాని అది నిజంకాదు. హాస్యానికి రాసిన మాటేగాని భార్యంటే గాలిబ్‌కు చాలా ప్రీతి. ఆమె గొప్ప దైవభక్తిపరాయణురాలు. సదాచార సంపన్నురాలు. తాను భోంచేసే పాత్రలు వేరుగా, భర్తవి వేరుగా పెట్టేది. సర్వదా భర్తసుఖం కోరి పరిచర్య చేసేది.

ఒకసారి ఇల్లు మారవలసివచ్చింది. అద్దెఇండ్లు వెతుకుతూ ఒక ఇల్లు తనకు నచ్చగా అందులోకి మారాలనుకున్నాడు గాలిబ్. అయితే ఆడవాళ్ళకు కూడా నచ్చాలి కాబట్టి 'ఇల్లు చూచిరమ్మని' భార్యను పంపినాడు. ఆమె ఇల్లు చూచివచ్చి అన్నది—"ఆ ఇంట్లో దయ్యం వుందని వదంతిగా వుందండీ ఆ వీధిలో—" అని. గాలిబ్ నవ్వి—"నిన్ను మించిన దయ్యం ఎక్కడుంటుంది? పద, ఆ ఇంటికి" అన్నాడట!

ఒక చలికాలంపూట. తన ఇంట్లో పంజరంలో చిలుక రెక్కల్లో ముక్కు దాచుకుని తలవంచుకుని కూచునివుంది. అది కంటబడింది గాలిబ్‌కి. "ఏమిటే చిలుకా? నీకు పెళ్ళాంలేదు, పిల్లలులేరు. అయినా ఎందుకిలా విచారంగా తల వాల్చుకునివున్నావు" అని అడిగాడు.

ఒకసారి గాలిబ్ మామగారి అన్న వచ్చారు. మహమ్మదీయమత ప్రవక్తల వంశవృక్షం తయారుచేశారు ఆయన. వాటి ప్రతులు తయారుచేయవలసిందిగా ఆ పని గాలిబ్‌కు పురమాయించారు. ఈసురోమంటూ రాసింది రాసి కాపీలు తీయడం గాలిబ్‌కు ఇష్టంలేదు. కాని కాదనలేక ఒకటి రెండు ప్రతులు తీసి ఆయనకు చూపించాడు. అందులో కొన్నితరాలు వదిలేసి రాశాడు గాలిబ్. తాత తరువాత మనుమడు—ఇలాగ. అదిచూచి "ఏమిటి ఇలా చాలావదిలేశావు" అని అడిగాడు ఆయనగారు. "వంశవృక్షం పైదాకా వెళ్ళడానికి ప్రతిమెట్టూ ఎక్కుతూంటే చాలాకాలం పడుతుందికనుక భక్తులు గబగబా పైకివెళ్ళడానికి సులభమైన మార్గం వేశాను" అన్నాడట గాలిబ్. ఇక ఇతనికి పని చెబితే లాభంలేదని తానే ప్రతులు తయారుచేసుకున్నాడట ఆ పెద్దమనిషి.

గాలిబ్‌కు పిల్లలులేరు. కలుగలేదని కాదు. ఏడుగురు పుట్టి ఏడుగురూ గిట్టినారు. ఆపిదప తన దగ్గర బంధువుల పిల్లవాణ్ణి పెంచుకున్నాడు.

జీవితంలో ఎగుడుదిగుడులు, కష్టసుఖాలు దండిగా అనుభవించినవాడు గాలిబ్. వార్ధక్యం వచ్చి నడవలేని స్థితి ఏర్పడినప్పుడు కూడ సాహిత్యసంగం

మానలేదు. ఆశువుగా పద్యాలు చెబుతుండేవాడు. ఇతరుల పద్యాలు దిద్దుతుండేవాడు. లేఖలకు జవాబులు వ్రాయిస్తుండేవాడు.

పోనుపోను జీవితంమీద విసుగొచ్చింది. ఇక ఈ రోజు చనిపోతాను; తప్పదు అంటుండేవాడు. ఒకరోజు మున్షి జవాహర్ సింగ్ తన దగ్గరకు రాగా "నేను ఈరోజు తప్పక చనిపోతా"నన్నాడు. "మీరు ఈరోజు చనిపోరు" అన్నాడు మున్షి. "చావు దానంతటది రాకపోతే తల పగులగొట్టుకొని చని పోతా"నన్నాడు.

ఒకమాటు ఏదో అంటువ్యాధి ఊరంతా వ్యాపించింది. ఒకతను పర గ్రామవాసి, గాలిబ్ దగ్గరకు వచ్చి "మహామారి తగ్గిందా?" అని అడిగాడు. "డెబ్భైయేండ్లవృద్ధుని చంపలేనిది మహామారి ఎలా అవుతుందయ్యా?" అని ఎదురు ప్రశ్న వేశాడట గాలిబ్

తుదిరోజుల్లో తరుచు మూర్ఛలు వస్తుండేవి. స్పృహ లేకుండా పడివుండే వాడు చాలాసేపు. కొన్ని నిముషాలకు మళ్ళీ స్మృతివచ్చేది. చనిపోవడానికి ఒకరోజు ముందు చాలా సమయంతరువాత స్పృహవచ్చింది. ఒకరిలేఖకు జవాబువ్రాయిస్తున్నాడు గాలిబ్. "నా సంగతి నన్నేమడుగుతావు? రెండు రోజులైనాక పక్కింటి వాళ్ళను అడుగు" అని జవాబు. ఆరోగ్యం, క్షేమ సమాచారం తెలుపవలసిందిగా అల్లావుద్దీన్ అహమద్ ఖాన్ రాసిన లేఖకు జవాబు ఇది. త్వరలో తాను చనిపోతానని చెప్పడానికి బదులు చమత్కారంగా—"నన్నేం క్షేమసమాచారాలు అడుగుతావు? కొన్నాళ్ళైనాక పక్కింటివాళ్ళను అడుగు" అని రాయించాడు. పక్కవాళ్ళను అడుగవలసి వస్తుందనగా తాను ఇక ఉండడు అని.

మహాకవి, ఉత్తమ మానవుడూ, నిర్మల మనస్కుడూ, వ్యథితజీవి, గాలిబ్ 1869-వ సంవత్సరం ఫిబ్రవరి 15-వ తేదీన తన భౌతికదేహాన్ని విసర్జించి అమరకీర్తికాయంతో అఖిలసాహితీలోకంలో అవతరించాడు.

బాల్యంలో, జమీందారీ సమాజ వ్యవస్థలో ఉన్నా, సంప్రదాయాలను ధిక్కరించటం బ్రహ్మప్రళయంగా కనిపించినా, తాను అత్యంత అనుచితమని రాజాధిరాజుల కొలువు చేయలేదు. తన స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని అంతిమం కాపాడుకున్నాడు. తనను లెక్కచేయనివాణ్ణి తానూ లెక్కచేయలేదు. అన్యులకు దాసుడై నీచంగా జీవించలేదు. విషాన్ని అమృతంగా భావించిన మహాకవి అతడు. దారిద్ర్యాన్ని మానవమనోబల పరీక్షానికషంగా భావించి అనుభవించాడు. నిరాశతో క్రుంగక, ఆశతో, ఉత్సాహంతో, చైతన్యంతో, ముందుకు సాగినాడు. తాను నమ్మినది చేసినాడు. తనకు నచ్చని దానిని తిరస్కరించినాడు. నవ్వి, నవ్వించి ఆరోగ్యవంతంగా జీవించినాడు.

మానవకోటి హృదయాలను ఆకళించుకుని వాటి స్వరూపస్వభావాలను అలవరచుకుని కవితద్వారా చిత్రాలుతీసినాడు. ప్రతి గుండెగాయాన్ని ఒక కవితాభాగ్యంగా ఎంచినాడు. కష్టాలను ఇష్టంతో భరించినాడు.

భారతీయ మహాకవులలో ఒకడుగా ఉన్నతపదవిని పొందిన గాలిబ్ ఏ ఒక్క భాషకో, ఒక్క జాతికో, వర్గానికో, మతానికో చెందినవాడు కాడు. అతడు సంకుచితాలకు అతీతుడు. ఫార్సీలోనూ, ఉర్దూలోనూ మాత్రమే రాసినా, భాషలకు అతీతమైన ఆలోచనలను లోకానికి ప్రసాదించినాడు. మహమ్మదీయ మతస్థుడే అయినా అన్ని మతాలనూ ఆదరించినాడు. మతాల మడ్డిని పులుముకోలేదు. ఎంత మహాపండితుడైనా, పాతనియమనిబంధనలకువిధిగా కట్టుబడి ఉండకుండా, స్వతంత్రంగా విహరించినాడు. మహారాజుల ఆస్థానాల్లో ఉన్నా, ఆత్మను వారికి అమ్ముకోలేదు. ప్రేయసీ విరహాన్ని వర్ణించినా, అసమర్థునివలె పొలికేకలు వేయలేదు. వెర్రిగా రోదించలేదు. ఆరోగ్యవంతమైన వేదననే అనుభవించినాడుగాని ఆత్మవినాశకరమైన బాధలో పడలేదు. మైత్రికి విశిష్టస్థానమిచ్చినాడు. ఎవరినీ ద్వేషించలేదు. ఆపత్కరములలో అనల్పాగ్రహమును ప్రదర్శించినాడు. మృత్యువుకు బెదరలేదు. డబ్బుకు లోబడలేదు. స్వసౌఖ్యాలకోసం అర్రులుచాచలేదు. తాత్విక చింతన మరువలేదు. అయితే, సంకుచితమతధర్మాలను నమ్మనూలేదు.

అన్ని తరాలకూ, అన్ని యుగాలకూ, అన్ని జాతులకూ జలదరింపు కలిగించే సార్వజనీన సార్వకాలిక భావపరంపరను అభివ్యక్తంచేసే విశ్వభావనను పెంపొందించినాడు. అన్నిటిలో మితంగా వ్యవహరించినాడు.

గాలిబ్ ప్రేయసి విషయంలో ఎన్నో అభిప్రాయభేదాలున్నాయి. గాలిబ్ వివాహం 13 వ ఏటనే అయింది. వివాహం తరువాత కొన్నాళ్ళకు ఒకమ్మాయిని ప్రేమించినట్లు వదంతులున్నాయి. తాను స్వయంగా ఒక చోట ఒక అమ్మాయిని ప్రేమించినట్లు వ్రాసుకున్నాడుగాని, హాస్యానికో, లేక కేవలం కావ్యధోరణిలోనో రాసినా రాసివుండవచ్చు. అనుకూలవతికాని భార్యతో జీవితం వెళ్ళబుచ్చిన గాలిబ్ ప్రణయాన్ని గురించిన వివరాలు బాగా తెలియవు. ఏమైనా ఆయన వెలిబుచ్చిన భావాలు కేవలం ఆయన అనుభవాలే కానక్కరలేదు. ద్రష్టయైన కవి వివిధ మానవస్వభావాలను ఇట్టే దర్శించగలడు. సాధారణాంశములలో ఉదాత్తతను కనిపెట్టగలడు కూడా.

# అనువాదరీతి

నేను చిన్నతనాన ఖమ్మంమెట్టులోని ఉస్మానియా హైస్కూల్‌లో చదువుతున్నప్పుడు మాకు ఉర్దూ, ఫార్సీ చెప్పే మేష్టారు 'జక్కీ' సాహెబ్ మా పాఠ్యక్రమంలోని విషయాలను కొంచెం పక్కన పెట్టి మహాకవి మిర్జా గాలిబ్ పద్యపాదాలు - ఫార్సీవి, ఉర్దూవి - చదివి, తాను తన్మయుడవుతూ మమ్మల్ని తన్మయపరిచేవాడు. గాలిబ్ పద్యాల విమానాలమీద ఎక్కి మేము సుందర నందనారామాలపైకి ఊరేగించేవాళ్ళము. నా ఆ బాల్యమిత్రుడు శ్రీ డి. రామలింగం, నేనూ సాహితీవాసనా విలసితమైన మనస్సులతో ఏవో ఊహలు ఊహించుకుంటూ క్లాసురూములో అగలు పొరాలపైకి ఎగిరిపోయేవాళ్ళం.

నాకు అలనాడు గాలిబ్ పట్ల ఏర్పడిన ఆ మక్కువ ఈనాటికి ఆయన రచనల అనువాదంద్వారా రూపందిద్దుకున్నది. మతోన్మాదులు విహరించిన నేలన మతాతీతుడుగాను, సంప్రదాయజ్ఞులు నెలకొనచోట సంప్రదాయ భేదకుడుగాను, పురాతనత్వమే ఆదర్శమని నమ్మినచోట అతినవ్యుడుగాను వెలసిన మహాకవి గాలిబ్ నా హృదయంలో ఇమిడిపోయినాడు. ఆయనలోని ఆ స్వతంత్రత, ఆ ఆర్ద్రత, ఆ గుప్తత నన్ను ముగ్ధుణ్ణి చేసినవి. కాళిదాసాదులవలె మానవతాగిరి శిఖరాగ్రంమీద తేజోమూర్తిగా శాశ్వతస్థానం ఏర్పరచుకున్న గాలిబ్ అన్నిభాషలవారికీ ఆరాధ్యుడు.

భాషాబంధం కొంత కృత్రిమమైనదే అనాలి. మనం ఎరుగని భాషలోని మహాకవులు మనకు పరిగ్రాహ్యులు కారా! కాకుంటే కాళిదాసు, షేక్స్పియర్ వంటివారు వారివారి భాషాపరిధులలోనే బంధితులై ఉండవలసింది. అలా కాకుండా విశ్వకవులుగా వెలసినారెట్లు? భాష, శరీరంవంటిది; కవిత ఆత్మవంటిది. ఆత్మసౌందర్యాన్ని ఆరాధించేవారికి భాష, అడ్డురాదు.

మన రాజ్యాంగం అలనాడు గుర్తించిన పదునాల్గు ముఖ్యభాషల్లో ఒకటై, కోట్లాది ప్రజలచేత మాట్లాడబడి, గొప్ప సాహిత్యసంపద గలిగి, గాలిబ్ వంటి మహానుభావులను కానుకచేసిన ఉర్దూభాష అన్యులకు ఎలా వున్నా, తెలుగువారికి ఆదరపాత్రమైనది. మన రాష్ట్రంలో ప్రభుత్వంచేత గుర్తించబడిన రెండవ అధికారభాష అది. అందులోని సొగసులు తెలుసుకోవడం చాలా అవసరం.

అయితే పేటికలలో భద్రపరచబడిన మణిని సాధించడం ఎంత కష్టమో పద్యాలలో దాగిన గాలిబ్ హృదయాన్ని అందుకోవడంకూడా అంత శ్రమతో కూడిన పని. ప్రతిపద్యాన్నీ అకళింపుచుకొని, ఆ పద్యానికి వివిధవ్యాఖ్యాతలూ, అనువర్తకులూ చెప్పిన అర్థాన్ని చదివి, నాకు స్ఫురించిన అర్థాన్ని నిర్ణయించుకొని, తిన్నని తెలుగురూపంలో మళ్ళీ ఆ హృదయాన్ని ఆవిష్కరించడం కొంత కష్టమైనపనే. ఒక్కొక్క పద్యాన్నీ తెలుగులోకి దించడానికి రోజులకొలదీ రోజులు పట్టేవి. అప్పటికీ సంపూర్ణంగా మూలార్థం రాకుంటే మళ్ళీ మార్చవలసివచ్చేది. ఇది అనువాదం కాని అనుసరణ కాదు. కనుక నా కల్పన ఈషణ్మాత్రమూ పనికిరాదు. తెలుగుపాఠకులకు గాలిబ్ భావం అందడానికి కావలసిన మార్పులు చేయడానికి మాత్రమే నాకు అధికారం వుంది. అంతకు మించి లేదు. ఇలాంటి నిర్బంధాలతో ఈ అనువాదానికి ఉపక్రమించాను. బాగా జనాదరాన్ని పొందిన ఆయన పద్యాలు ఇంచుమించు అన్నీ తీసుకున్నాను. క్లుప్తత (Brevity) చెడకుండా రెండు పాదాలలోని భావాన్ని రెండుపాదాలలోనే చాలావరకూ ఇమిడ్చినాను. ఎక్కడో మరీ వివరణ అవసరమైనచోట నాలుగుపాదాలుగా పెంచాను. అనువాదానికి ఆటవెలది, తేటగీతి వాడుకున్నాను. ఎక్కడో ఒకటి రెండు చోట్ల ద్విపదను, రగడను ఉపయోగించినాను.

మూలానికి నా అనువాదం ఎంత సన్నిహితంగా వున్నదో మచ్చుకి ఇక్కడ చూపిస్తాను.

ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము
నరుడు నరుడౌట యెంతొ దుష్కరము సుమ్ము!

దీని మూలం :—

బస్కె దుష్వార్ హై హర్ కామ్ కా ఆసాఁ హోనా
ఆద్మీకో భీ మయస్సర్ నహీఁ ఇన్సాఁ హోనా.

ఏమి వచియింతు దౌర్భాగ్య మింతకన్న ?
చచ్చిపోవుదమన్నను చావురాదు.

మూలం :—

కిస్ సే మహ్రూమీయె కిస్మత్ కీ షికాయత్ కీజియే
హంనె చాహాథాకె మర్ జాయేఁ సో వహ్ భీ నహువా.

* * *

ఎంతకని వ్రాతు నా గుండెవంత ? ఇంక
ఆమెకే చూపెదను రక్తిలాంగుళులను.

మూలం :—

దర్దెదిల్ లిఖూఁకబ్ తక్ జావూఁ ఉనక్కో దిఖ్లాదూఁ
ఉంగ్లియాఁ ఫిగార్ అప్నీ ఖామయె ఖూఁచుకాఁ అప్నా.

* * *

నేను మరణింప నాయింటిలోన మిగిలె
ప్రేయసుల చిత్తరువులును, లేఖ; లంతె.

మూలం :—

చంద్ తస్వీరే బుతాఁ, చంద్ హసీనోంకే ఖుతూత్
బాద్ మర్నేకే మెరే ఘర్ సే యహ్ సామాఁ నిక్లా.

* * *

డాగె పరదాల, పగలు తారాగణమ్ము,
రాత్రికేమయ్యెనో దిగంబరమ్ము లయ్యె.

మూలం :—

థీఁ బనాతున్నాశె గర్దూఁ దిన్కె పర్దేమేఁ నిహాఁ
షబ్ కో ఉన్ కే జీమె క్యా ఆయీ కె ఉర్యాఁ హోగయీఁ.

ఏల నన్ను మరచి వెరుగబోయితి, నామె
వలపు చూపు చూచె, భస్మమైతి.

మూలం :—

కర్నే గయేథే ఉస్ సే తఘాఫుల్ కా హం గిలా
కీ ఏక్ హీ నిగాహ్ కి బస్ ఖాక్ హోగయే.

* * *

ఏదో నడుమున్నదంటా బాధింపబడెదనె;
హృదయమనా? కాదు, బాణంపుటినుపముక్క.

మూలం :—

కుఛ్ ఖటక్తా థా మేరే సీనే మే, లేకిన్ ఆఖిర్
జిస్ కొ దిల్ కహ్‌తే థే సో తీర్ కా పైకాం నిక్లా.

* * *

వచ్చె సరగా తరుణ వాసంత సమయమ్ము,
గోళ్లు మరల గుండె గోక జొచ్చె.

మూలం :—

ఫిర్ జిగర్ ఖోద్నే లగా నాఖున్
ఆమదె ఫస్లె లాలకారీ హై.

* * *

నీకు నేను గిట్టనియెడ సాకీ! నాకు
చషకమీయకుము, దోసిట చాలు మధువు.

మూలం :—

పిలాదే ఓక్ సే సాకీ! జో హంసె నఫ్రత్ హై
ప్యాలా గర్ నహీఁ దేతా, న దే, షరాబ్ తో దే.

ఎచట నీ పదాంకముల నీక్షింతు, నచట
అడవిదారియు నందనమట్లు తోచు.

మూలం :—

జహాఁ తేరా నక్షె ఖదం దేఖ్తేహైఁ
ఖయాబాఁ ఖయాబాఁ ఇరమ్ దేఖ్తేహైఁ.

* * *

గాలిబా! నీదు తాత్త్విక కలన, యహాహా!
త్యాగకుండిన నిను మేము యోగి యనమె!

మూలం :—

యే మసఇలే తసవ్వుఫ్, యే తేరా బయాన్ గాలిబ్
తుఝే హం వలీ సమఝ్తే జో న బాదాఖ్వార్ హోతా.

* * *

హింసపడు మాకు బ్రహ్మాండ మెంతో యిరుకు,
అందు గగన మొక్కక పిపీలికాండమంత.

మూలం :—

క్యాతంగ్ హం సితంజద్గాఁ కా జహాఁ హై
జిస్మేఁ కె ఎక్ బైజెమోర్ అస్మాఁహై.

* * *

పత్రమున నగ్నిశిఖ భద్రపరుచ వచ్చు,
హృదయమున దుఃఖబాధ భరింపలేము.

మూలం :—

లపట్నా పర్నియాఁమేఁ షోలయే ఆతిష్ కా ఆసాఁహై
వలే ముష్కిల్ హైహిక్మత్ దిల్ మేఁ సోజెగంఘుపానేకా

పానశాలయె లేని చేదైన నేమి?
బడి, మసీదు, సత్త్రువు సర్వమ్మునొకటె.

మూలం :-

జబ్ హొగయా ఖరాబ్ తో ఫిర్ అబ్ క్యా జగహ్ కీ ఖైద్,
మస్జిద్ హో, మదర్సాహో, కోయిఖాన్ఖాహో.

* * *

ఎవతె అధరచక్రమును భావించినావొ
రేయి పదినెల్ల చుంబనశ్రేణి వెలసె.

మూలం :-

దహఁనెతంగ్ ముఝే కిస్ కా యాద్ ఆయాథా
కె షబ్ ఖయాల్ మేఁ బోసోఁ కా అష్దహాన్ రహా.

* * *

స్వీయలోపమ్ము తెలుగుట పెద్ద విద్దె
లోపమెరిగినవాడె పూర్ణుడగు నరుడు.

మూలం :-

ఐబ్ కా దర్యాఫ్త్ కర్నాహై హునర్ మందీ, అసద్
నుక్స్ పర్ అప్నే హువా ముత్తలా కా మిల్ హువా.

* * *

వత్తునని రాక నాయింటి వాకిలికిని
నన్ను కాపలాగా నిల్పినావదేమొ?

మూలం :-

వాదా ఆనేకా వఫాకీజె యహ్ క్యా అందాజ్ హై
తుంనే క్యోఁ సోంపీ హై మేరే ఘర్ కీ దర్బానీ ముఝే.

భ్రుకుటి క్రిందుగ నయనమ్ము పోల్కి గాని
ఆలయము పంచలనె పానశాల వలయు.

మూలం :-

మస్జిద్ కే జేర్ సాయా ఖరాబాత్ చాహియే
భౌం పాస్ ఆంఖ్ ఖిబ్లా హాజాత్ చాహియే.

* * *

మూలానికి ఆగా సన్నిహితంగా ఉండేట్లు అనువాదం సాగించినాను. ఉభయ భాషలు ఎరిగినవారు, సహృదయులైన వారు సావధానంగా పరిశీలింతురుగాక.

# కృతజ్ఞతలు

గాలిబ్ గీతాల రచనకు మొదట నన్ను ప్రోత్సహించి, తమ పత్రికలో వరుసగా ప్రచురించినవారు 'భారతి' పత్రికా సంపాదకులూ; ముఖ్యంగా నా మిత్రులు శ్రీ తిరుమల రామచంద్ర గారు. నా అనువాదాలు విని "భేష్" అని నన్ను ఉత్సాహపరచినవారు శ్రీ ఆరుద్ర, శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు, శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ దేవులపల్లి రామానుజరావు గార్లు.

ఈ గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా ప్రచురించి ఆంధ్రప్రజలకు అందించిన భాషాభిమానులు యం. శేషాచలం అండ్ కంపెనీవారు; ముఖ్యంగా శ్రీ యం. యస్. రావుగారు. దీనిలోని ప్రూఫ్‌లను పరిశీలించిన పండితవర్యులు శ్రీ టి. వి. రంగాచార్యులు గారు. ఈ ప్రచురణ విషయంలో ఆసక్తి శ్రద్ధ వహించి తమ పనిగా భావించి శ్రమపడినవారు శ్రీ మల్లాది నరసింహశాస్త్రి గారు. ఈ గ్రంథానికి చక్కని చిత్రాలు రచించి ఇతోధికశోభను చేకూర్చిన వారు శ్రీ బాపు.

నా ఈ రచనను అంకితంగా గ్రహించి తమ సారస్వతాభిమానాన్ని తెలియించిన సహృదయులు, విఖ్యాతనటులు శ్రీ అక్కినేని నాగేశ్వర రావు గారు.

ఈ అనువాద సందర్భంలో రేయింబవళ్లూ నా వెంట ఉండి గాలిబ్ రచనలపై వివిధ వ్యాఖ్యాతలొసగిన వ్యాఖ్యానాలను చదివి, వాటిలోని పై శిష్ట్యాన్ని నాకు అందించిన పండితులు, నా సహాధ్యాయి, ఆప్తుడు శ్రీ కృష్ణ గోపాల్ సహాయం అనన్యమైనది

డా॥ పల్లా దుర్గయ్యగారి ఇంట్లో సుష్ఠుగా భోంచేసి రాత్రులు రాత్రులు నియాన్ లైట్ పాలవెన్నెలకాంతులలో గాలిబ్ మధురగీతాలను అనువదించాను. నాపట్ల, ఈ కావ్యంపట్ల ప్రత్యేకమైన అభిమానంతో ఉత్తమ పీఠిక రచించిన నా చిరమిత్రులు, రాజ్యసభాసభ్యులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ కార్యదర్శి, బహుభాషావేత్తలు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి వాత్సల్యం మరువరానిది.

మహాకవి గాలిబ్ మధురహృదయాన్ని ఆంధ్రులకు అందించడంలో తోడ్పడిన ఇందరు మహానుభావులకూ నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి.

ఈపని చాలా కష్టసాధ్యమైన పనుటలో అతిశయోక్తి లేదు. ఒక్కొక్క పద్యాన్ని జీర్ణించుకుని దాన్ని తెలుగులోకి దించడానికి రోజులు రోజులు పట్టేది. గడచిన 1960వ సంవత్సరమంతా గాలిబ్ కవితను మననం చేయడంలోనూ, దానికి తెనుగురూపం ఇవ్వడంలోనూ వ్యయించాను. ఆ సంవత్సరమంతా నా హృదయంలో సాక్షాత్కరించి ఆత్మీయంగా నాకు తన హృదయ రహస్యములను బోధపరచిన అమరమూర్తి మిర్జా అసదుల్లాబేగ్ గాలిబ్ నా నరనరాలలో జీర్ణించుకుపోయినాడు. ఆయన అమృత హృదయం సర్వదా నా కవితకు ఉద్దీపనను, ఉత్తేజనను, ఆవేశను ప్రసాదిస్తుందని ఆశిస్తున్నాను. భాషాభిమానులెల్లరు నా ఈ కృషిని సాదరంగా పరిశీలింతురుగాక!

దాశరథి

ఏను స్వయముగా కవితన్ వరింపలేదు,

తానె వరియించె కైతల రాణి నన్ను.

# గాలిబ్ గీతాలు

ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము,
నరుడు నరుడౌట యెంతో దుష్కరము సుమ్ము. 1

వేరులోనుండి కొమ్మలు వెలసినట్లు
అన్ని శబ్దాలు నిశ్శబ్దమందె పుట్టె. 2

స్వీయలోపమ్ము లెరుగుట పెద్ద విద్య;
లోప మెరిగినవాడె పూర్ణుడగు నరుడు. 3

పత్రమున నగ్ని శిఖ భద్రపరుచవచ్చు,
హృదయమున దుఃఖబాధ భరించలేము. 4

ఈ జగత్తు స్వభావమ్ము నేఁటియందు!
మంచి చేసిన వానిని ముంచునారు! 5

నరములం దందరికి రక్త మురుకుగాని
కంట జారని దెట్లు రక్తమగునోయి? 6

అవల వెడలక నిలచిన అశ్రుకణము
పెను తుఫానుగా వెడలి వచ్చునది నేఁడు. 7

అన్ని రోగములకు నౌషధం బుండియు
ప్రణయరోగమునకు కనము మందు. 8

భిక్షుకునివంటి వేషము వేసినాను;
దాతలగువారి చేతలు చూతు నింక. 9

బ్రతుకుపై నింత విశ్వాస పడెద రేల?
ఏడి మాంధాత? పురుకుత్సు డేడి నేడు? 10

గ్రీష్మమున వాన కురిసిన సూష్మమెసగు,
అశ్రు కన్నీటితో గుండె నగ్గి పెరిగె. 11

సహృదయునకు బయట సన్మానమబ్బును
శుక్తివిడిన నాటి మౌక్తికముగ. 12

మహిత కస్తూరికా పరిమళము లొలుకు
సరస మధుధారకై గదా స్వర్గవాంఛ! 13

సింధువును జేరి బిందువు సింధువగును;
ధ్యేయమును బట్టి ప్రతిపని దివ్యమగును. 14

చక్రవర్తిచేతి స్వర్ణపాత్రిక కన్న
నాదు మట్టిదిప్ప నయము లెమ్మ 15

నిప్పు నీళ్లలో చల్లార చప్పుడగును,
ఎదియు గతియించునపుడు రోదించుగాదె! 16

సంతసమునుగోరి మధువాను చవట యెవడు?
లోకమెల్లను మరువ గోరుదును నేను, 17



ప్రియసిగ్గుహావీధి స్వప్రహాతొప్ప పడిపోయి
ముదితకాలిగురుతు ముద్దుగొంటి. 18

బాధ కలిగినపుడు పలవించెదను నేను,
నాది హృదయమోయి, కాదు రాయి! 19

కత్తి చేతలేక కదనమ్ము జరిపెడి
ఇంతి కెవ్వ డసువు లీయకుండు? 20

బ్రతికినన్నినాళ్ళు వెతలు తప్పవు కదా!
మృతియె వెతలదీర్చు మేటి మందు. 21

వెతల నోర్తుమని వెత లంతమైపోవు,
సులభమగు నలభ్యములును దాన. 22

ప్రళయ ముంచెగాని, తలప నద్ది విరహాగ
రాత్రికన్న భీకరమ్ము కాదు. 23

వలపు లేనాఁడుగాని నిష్ఫలము గావు,
కాయ కాయని వృక్షమ్ము కాదు వలపు. 24

బాధలో నాకు రుచి కనుపట్టగాని
చాన నన్ను బాధించుట మానుకొనెను. 25

నేను నీ వాకిటనె కట్టినాను గృహము,
ఇంకనైన నా యిల్లెటో యెఱుగ లేవె? 26

బిందు వణఁగారి సింధువై వెలసినట్లు
రుజయు పెంపొంది ఔషధరూప మందు. 27

సఖికి కానుక సమర్పింపఁజాల నేను,
ఈయఁదగు హృదయమె లేకపోయె నాకు. 28

ఆమె సౌందర్యమును చూచినంత తెలిసె
ప్రళయ ఝంఝా ప్రభంజనబాధ యేమొ. 29

ఖైదులో నాకు నీ జడమీఁది చింత,
దానితోఁ గూడ శృంఖలాగ్లాని కొంత 30

గ్రంథిపడనినాఁడు కలవెయ్యొ పథములు;
గ్రంథిపడెను నేఁడు, కలదె పథము? 31

ఈ యుజాఁడతమ్మునందు నశించు నన్ని,
గాలిలో దీపమట్లుండెఁగాదె రవియు! 32

నీటిచుక్క ముత్తెమటు వర్తించెను,
కనులలోన నిలువగలిగె నిపుడు. 33



గుండె దొంగిలించుకొనిపోయె జంకక,
ముద్దొసంగ వెనుకముందులాడు. 84

చిత్రగుప్తుడు వ్రాసినమాత్ర మనము
పాపు లగుదుము; సాక్షి యెవ్వండు కలడు ? 85

నేను మరణింప నాయింటిలోన దొరికె
ప్రేయసుల చిత్తరువులును, లేఖ; లంతె. 86

డాగె షరదాల పగలు తారాగణమ్ము,
రాత్రి నేమయ్యెనో దిగంబరమ్ములయ్యె. 87

ప్రేయసీకోపవహ్ని తప్పించుకొనగ
ఛత్రమన్నను నన్నది చావనీదు. 88

ఎంతకని వ్రాతు నా గుండెవ్యథంత ? నింక
ఆమెకున్ జూపెదను రక్తిలాంగుళులను. 89

నీకు నేను గిట్టనియెడ సాక్షి! నాకు
చవక మీకుము, దోసిట చాలు మధువు.

నేను మరణింప నామె చింతింపదొడగ,
ఎంత తొందరగా కరుణించె నన్ను! 41

ఎప్పు డాలించు నామె నా హృదయబాధ?
అదియు నానోటినుండి యె ట్లవధరించు? 42

హృదయమందునుండి ఉదరమ్మునకు చేరి
రెంటి కలిపె నీదు కంటిచూపు. 43

వచ్చె నరుణాతరుణ వాసంత సమయమ్ము,
గోళ్లు మరల గుండె గోకజొచ్చె. 44

ఏదో వక్షమ్మునందు బాధింపదొడగె;
హృదయమా! కాదు, బాణంపుటినుపముక్క. 45

పల నన్ను మరచె నిరుగబోయితి; నామె
వలపుచూపు చూచె, భస్మమైతి. 46

భ్రమరరోదన మెట్లు వ్యర్థముగ బోవు?
తెలడి పువ్వుగుండె వేయిముక్క లయిపోయె. 47

దుఃఖములు ధీరులకు నొక్కత్రుటిని తగ్గు,
వైద్యుతాగ్నితో దుఃఖదీపంబు వెలుగు. 48

ఎచట నీ పదాంకముల నీక్షింతు, నచట
అడవిదారియు నందనమట్లు తోచు.

కానుపించుగాని గమ్యమ్ము చిక్కదు;
నేను నడచినట్లు తాను నడచు.

ఎంతో ఉత్సాహపడుచు కష్టింతు మగార !
మృతియె లేకున్న రుచి యేది బ్రతుకులోన ? 51

గాలిబా ! నీవు తాత్త్వికత గలవ యహాహా !
త్రాగకుండిన నిను మేము యోగి యనమె ? 52

హీనపడు మాకు బ్రహ్మాండ మెంతో ఇరుకు,
అందు గగన మ్మొక్క పిపీలి కాండ మంత. 53

పానశాలయె లేని దేదైన నేమి ?
బడి, మసీదు, సత్తరువు సర్వమ్ము నొకటె. 54

స్వాస్థ్యమొసఁగిన మందిచ్చువాఁడు వలదు;
ప్రాణములు పోవ నేడ్చెడివాఁడు వలదు. 55

కుసుమములు విచ్చె, మొగ్గలుకూడ విరిసె,
తెల్లవారె, నాయనా కన్ను తెరువ లేదు. 56



ద్వారబంధములును తలుపుతాళము లేని,
ఇరుగుపొరుగు లేని ఇల్లు వలయు. 57

మాటలాడువాడు, మందలించెడువాడు
నెవడు లేనిచోట వసింపవలయు. 58

సంతసం బింక నెట్టుల సాధ్యపడును?
మెదడునను పూలతోటలు, మది నెడారి. 59

ఆమె తోటకు వాహ్యాళి కరిగె నంట,
ఇంక తోటలో పూలు వాంఛించు నెవడు? 60

ఎవతె అధరచక్రమును భావించినానో
రేయి పదినిండ చుంబనశ్రేణి వెలసె. 61

ఈయెడారిముండ్ల కెడద ముక్కలుచిక్కి
పూలవోలె నిలుపబడినాడ. 62

మెరుపులో, అగ్నికీలలో పొరుగువాని
అంగచందాలు గల ఆ యొయ్యారి యెవరు? 63

వత్తునని రాక, నాయింటి వాకిలికిని
నన్ను కాపలాగా నిల్పినా వదేమొ? 64

భ్రుకుటిక్రిందుగ నయనముపోల్కి, గురువ!
ఆలయముపంచలనె పానశాల వలయు. 65

ఎడద నాడి లోలోన దహింపజొచ్చె
కప్పుకొనియున్న బూదిలో నిప్పువోలె. 66

అందకత్తెలతో మాటలాడుకొనుకు
చిత్రలేఖనవిద్య నేర్చితిని నేను.

గుండెలో సఖపై నున్న కోర్కె చచ్చె,
కారుచిచ్చంటి సకలమ్ము కాలిపోయె. 68

నా యెడందగూర్చి నాకేమి తెలియదు;
నేను వెదకుచుండ నీకు దొరికె. 69

మచ్చలను మృత్యువే కప్పిపుచ్చుకున్న
అంబరము లెన్ని యున్న దిగంబరుడనె. 70

మల్లియ, గులాబి, చంపకవల్లి పూచె;
రంగు•వేరయ్యును వసంతు రాక చెప్పె. 71

హూరిని ప్రార్థింప తలవంచినట్లుగానె
బాగ త్రాగి మ్రొక్కెము మధుభాండమునకు. 72

ఎంత విరుగపూచెనే తోట! శుకపికా
లెగురునపుడు పూల తగిలె కాళ్లు. 73

మందుకొఱకు తిరిగి మరి హెచ్చె నా బాధ
కాళ్లుగూడ నెత్రు గ్రక్కెనొచ్చె. 74

పరుగు లెత్తియెత్తి పట్టుబడితి నేను
బందిపోటుదొంగ పదములొత్త. 75

ఆమెపాదతీర్థ మానగోరితిగాని
కాళ్లు నేలమీద కడిగె నామె. 76

అశ్రుధారావివర్ణ నేత్రాంచలములు
కాంతిలగ గుండెకోసి రక్తమ్ము నిడుము. 77



ఎవని ఇలు కాదు, వాకిలియేని కాదు,
దారిలో కూరుచుంటి, వద్దనెద రేల? 78

పగలు దోయుగాబడ, రాత్రి పట్టె నిద్ర,
నన్ను దోచిన దొంగకు నతులొనర్తు. 79

మబ్బువచ్చి నాదు మడిని పండింపగా
మెరుపువచ్చి దాని మ్రింగజొచ్చె. 80

శస్త్రవైద్యు కత్తిసైతము రక్తాశ్రు
కణము లొలికె, నీవు కరుగవేమొ! 81

నాదు గుండెగాయము కుట్టు సూదికంట
అశ్రుజలధార దారమై అవతరించె. 82

నేను తోటలో కాలూనినానో లేదో
కోకిలాబృందములు కావ్యగోష్ఠి జరిపె. 83

భానుసోమాదులకు తీసిపోని నాదు
నేత్రముల నీ పదా లంటనీయ వేమొ? 84

నీ పదమ్ముల చుంబింపనీయవేమొ?
గగనములతోడ సమమైన కాన నేను? 85

నన్ను తోటకు గొంపోకు, నన్ను జూచి
పూలకన్నులు రక్తాశ్రువులను నించు. 86

పానసమయాన ఎదవిచ్చి పలుకవేని
ఏను త్రాగినమీదను కవ్వింతు నిన్ను. 87

వెలది! నీ ప్రణయాకృతి కొలుతునేని
ప్రళయబీభత్సమే ఒక నిలువు చిన్న. 88

ముదిమివలన వలపుపాలి కేళ లిడనైతి,
ఈ వసంతమెల్ల ఇట్లె గడచె. 89

నీదు రోగినిగూర్చి చింతించినారు
కాగితమ్మున మందులు కట్టువారు. 90

గాలిబా! త్రాగనని శపథాలు సేతు
గాని నీ ఒట్టుపై నమ్మకమ్ము బోవె. 91

నా విరహబాధ నేమందు! నాతిమొగము
కేల భావింతు, పొద్దటివేళ కురుల. 92

మనిషి ఏకాకియైనను మనసులోన
గుంపులుగ భావములు చేరి గోష్ఠిజరుపు. 93

ఏల కాళ్లు నొచ్చె బాలామణికి? రాత్రి
ఎవని స్వప్నసీమ కేగివచ్చె?



ఆమె ముద్దిచ్చుటకు వెనుకాడదేమొ !
కాని ఇమ్మని అడుగగా లేను నేను. 95

కోమలీ రాగరంజితాంగుళిక వోలె
పలితకుసుమముకుళమ్ము కన్పట్టదొడగె. 96

క్రీడతో ముజ్నావే పురి వీడిపోయె,
నన్ననుకరించి చెడిపోవకున్న వాడు! 97

ఎన్నో గాయమ్ము లెదనున్న నేమిపలుక,
ఏకవ్రణమున కే పువ్వు కీక పెట్టె. 98

ఇంత శ్రమపడి రంగద్దదేల గోళ్ళ ?
రంగధికమైనయెడల జ్వాలలు రగిల్చు. 99

ప్రేమభిక్షుకునిన్ హింసపెట్టు టరయ
ప్రణయసౌందర్య రాజ్ఞికి పాడిగాదు. 100

వలపు వలన బ్రతుకు బహూరుచ్యమైనది
ఎడద తీయదనము బడయసాగె;
బాధ కౌషధమ్ము బడసియు డెందంబు
మందులేని బాధ నందె పొరల.

ఇంట నుండంగ ననుమతినిచ్చి తీవు;
చుట్టియుండిన నాసెజ్జ నట్టె విచ్చి
పరచితినో లేదో శయనించుకొరకు నేను,
అంతలో 'వద్దు వద్దు పో' మ్మందువేమి! 101

ఆమె నూర్వశితో పోల్చినంత, నుంత
కోపగింపక తా నూరకొనెనుగాని
కినుక బూనిన నాతప్పె యనును జగము,
ఆమె యెక్కడ! ఊర్వశి యనగ నేడ ? 102

నాయెడద చీల్చి రక్తమండలము సేసె,
నేను వేదనతో మరణించినాను,
ఇపుడు గోళ్లకు నెఱుపురం గెట్టు లెక్క
వెలది తాను గోరంటాకు పెట్టుకున్న ? 103

నాకొఱకు నీవు వత్తువన్నయది నిజము,
జాగుసేయువటన్నది సత్యమగును,
అసలు నా వార్త నీ కందునంతలోన
మట్టిలో నేను కలిసెడి మాట నిజము. 104

కాలమే నాకు తగు నవకాశ మిడిన
చేసిచూపుదు నెన్నెన్నొ చిత్రములను,
మనసులో గల ఒక్కొక్క మచ్చ నాది
బీజమగు దివ్యదీపికావృక్షమునకు. 105

పొలతినయనపక్ష్మములను వలచితినని
కోపమున జనుల్ వ్రేలెత్తి చూపినారు
వారి ప్రతివ్రేలు బాణమై వచ్చి తాకి
అంతరాంతరపములయందు వ్యథనుకూర్చె. 106



మాటిమాటికి గిన్నెల మధువు పోసి
మధువునే బాధపెట్టుటి విధ మదేల?
దేవి! మధుపూర్ణ భాండమే తెచ్చి నాదు
నోటి కందీయరాదె, సంతోషపడెద. 107

స్వర్గమున తేనెధారల బడయఁగోరి
వసుధపై సురాపానమ్ము వదలె దేల?
ఈగ లెన్నెన్ని నాగా ఎంగిలించినట్టి
తేనె గా దిది, దివ్యమాధ్వీకమోయి! 108

వలపువలన నీవు వలవల నేడ్చిన
నా శిరమ్ము ఛేదసేమ్మనందె,
ఖడ్గధార పదనుగలిగినట్లుగ నశ్రు
ధారవలన పదనువాఁగె కనులు 109

స్వప్నమందు తాను వచ్చి న న్నోదార్చి
శాంతపరచనేని చాలు నాకు,
కాని దుఃఖవహ్ని కాసంత నిద్దుర
పట్టనీదు, స్వప్న మెట్లు లబ్బు? 110

నిన్ను ప్రేమించు టాటనుకొన్న దేమొ
నా యెడద, ఇప్పు డిటు వలపోయుచోడగ,
ఇట్లు వలవంతపా లొనరించినట్టి
యెడద నేరీతి శిక్షింపదొడగవలయు? 111

ధన్యము మూల్గుచుండె ధరణిపై నిండుగా
బాసపీరు తెవడు లేసర బోక,
పానశాలలోన పాత్రలు మధువుతో
తొణుకుచుండె త్రావు మనిషి లేక. 112

నీవు ప్రేమతో వచ్చుట పూవుతోట
కెంగొయూం సంతసమ్ము కల్గించె ననగ
చేయిసాచి నిన్ కౌగిట చేర్చుకోరి
మొగ్గలన్నియు వికసించ మొదలుపెట్టె. 113

వ్రాయ నేమి లేకపోయినను నీ పేరు
చేర్చి వ్రాతు నాకొక చిన్న లేఖ,
నీదు పేరు వలచి నిలచియున్నాడను
కాంక్షలూరు వలపుకాడ నేను. 114

వీణతీగ తాకిదేని ఝంఝమ్మని
రాగములు పరంపరలుగ వెడలు,
అట్లు నను కదల్చినట్లైన నీపైన
ఎన్నొ నేరములను విన్నవింతు 115

తరుణిచేతి అంబు తగులునట్లుగ నిల్చి
గాయపడగ కోర్కె గలదు నాకు;
అంబు తగుల కేగ, అద్దాని గొని తెచ్చి
తరుణి కిత్తు మరల తాను వేయ. 110

కాళ్ళు బొబ్బలెత్తి కడు మెల్లగా సాగు
బాటసారివోలె పరగినట్టి
కారవాగణమ్ము త్వరగా చరింపదు
పరిణాయదీర్ఘమార్గవర్తియగుచు. 117

నే నొసంగిన లేఖ సందేశహారుడు
తీసుకొనిపోయి ఆమె కందిచ్చుకన్న
ముందె నే నామెయింటికి పోయినాడ!
మెచ్చుకొనుడు మీరెల్ల నా పిచ్చి నిపుడు. 118

అందకత్తెల సాహచర్యమ్మునందు
కొద్దినాళులు గడపినగూడ చాలు,
ఘోరనిస్సార సంసార కుండమందు
ఎన్ని యుగములు జీవించు టేమి మేలు! 119

పిచ్చివాడ నేను, చచ్చిపోయిన గూడ
నా సమాధిమీద రోస మనక
పిల్లవాండ్రు విసరివేసినా రెన్నెన్ని
బండరాళ్లు పూలచెండులట్లు. 120

శిశువు వెనుక బోతి, చిక్కితే దాతడు,
వట్టిచేతు లూని వత్తునేని
జనులు నవ్వగలరుగనుక నే రా నింక,
తిరిగిరాక యెటకో అరుగగలను. 121

వనిత! నీవు భువిని వర్తిల్లుచుండగా
ఇంక నాకలోక మేల నాకు!
పోకతప్పదేని నాకలోకానకు
నీవుగూడ వేగ రావలయును 122

నన్ను హత్యచేసి నా సమాధిని నీదు
వీధిగట్టబోకు ప్రియ లతాంగి!
నా సమాధిబట్టి నలుగురు నీ యిల్లు
తెలిసికొనుట నోర్వగలనె నేను? 123

నాకు నీదు దర్శనమ్మైన యంతనే
మత్తుద్రమ్ము చూడ మరచినాను,
కానబడియుగూడ కనరాకపోతివి,
నాదు చూపు చెదరె నాల్గుదెసల. 124

నేను 'మజ్ను' వట్లు నీకు నా ప్రణయమ్ము
బయలుపరచజాలువాడ, కాని
గుండెలోన దాగి మండించు నా బాధ
వ్యవధి నిడదు ప్రేమ బయలుపరుప. 125

రెక్క లూడిపోయె భృంగమ్మునకు నేను
విశ్రమించుకొరకు వేళచిక్క,
ఇంక పూలగూర్చి ఏమాత్రమైనను
కోర్కె గలుగు వీలుగూడ లేదు. 126

ఆకురాలు కాల మైననేమి? వసంత
మరుగుదెంచినంత నొరుగునేమి?
నాదు చిన్నగూడు, నా జీవితపు గోడు
నా విషాదగాథ నాదె కాదె! 127

ఆమె పల్లకిలో నెక్కి అరిగె నాదు
వీధివెంబడి పడి కడు వేగముగను,
పల్లకిని మోయు భోయీలు బరువువలన
బుజము మార్చగా గోర నొప్పుకొనకుండ, 128

మనసులోని రహస్యాలు మరుగుపరుప
నోరు మెదుపక కూర్చుండనోపుగాని,
నేను మాట్లాడితినను దాచినాను వాని,
ఎవ్వరును వాని అర్థాలు నెఱుగ లేరు. 129

చల్లచల్లని పూర్ణిమాశర్వరులను
ఎంత మధువు లభించిన నంత గ్రోల,
శ్లేష్మతత్వమ్ము గల్గు శరీరమందు
వెచ్చదనము మరింతగా వచ్చుగాదె! 130

మన రహస్య మెరుగులు కనినంతనే యెంతో
సిగ్గుచెంది ఆలసించ కేగి
మట్టిలో న దాగినట్టి నీ అభిమాన
మాగు ననన్యసాధ్య మమృతవాణి! 131

వెలుగుచున్న దివ్వె నులిమివేసినయంత
కానుపించు నల్లనైన మచ్చ,
అట్లె పూర్తికాని అభిలాషముల మచ్చ
గుండెలోన కూరుచుండె నాకు. 132

గాలిబా! ఆమెతో చెప్పగలము నీదు
వ్యథనుగూరిచి, నీగుండెవంతగూర్చి,
కాని అంతమాత్రమున తా కనికరించి
చేరవచ్చు నటన్నది చెప్పలేము. 133

ఆదిమానవు డమరాలయమ్ము విడచి
వెడలిపోయిన గాథలు వింటిగాని
ఎంతో అవమానమంది నీయింటినుండి
ఎడద దురపిల్లగా నేను ఏగుచుంటి 134



కోపమనెడు కత్తి కున్న పదను జూచి
మురిసిపోయె దేల, ముదిత! నీవు-?
నా విషాద మనెడు నదిలోన నొక చిన్ని
నెత్తుటితరగవోలె నెగడు నద్ది. 135

సుఖసమాగమ వాంఛయు, సుఖవియోగ
బాధయు మదీయహృదయాన ప్రజ్వరిల్లు,
నాతితో నాదు వాంఛయు, నాదు బాధ
చెప్పుకొనగల్గు రోజు వచ్చినను చాలు. 136

పాడువడినయింట పచ్చిక మొలిచెను
వచ్చె నవవసంతవాసరమ్ము,
ఇంత శైశిరమ్ము యేతెంచినప్పుడు
ఇంటి అంధచంద మెట్లులుండు? 137

ఆమె తన గర్వమును వీడనపుడు నేను
ఆత్మగౌరవ మేల పోనాడవలయు?
నేను తలవంచి, నమ్రత బూని, పోయి
"అంత తలబిరుసే"లని అడుగు టేల? 138

కఠినశిలవంటి హృదయము గలుగుదాన!
తల పగులకొట్టుకొనుటయే నా తలపునైన,
నీ గృహద్వారబంధసన్నిహితశిలనె
తల పగులగొట్టికొనియెడి తలపు లేల? 139

వల తగిలియున్న నాకు నాఇలునుగూర్చి
చెప్ప వెరచెద వేలనే చిన్నపక్షి!
వనములో నిన్న పడిన ప్రభంజనమ్ము
నా కులాయముపై పడె ననుట యెట్లు? 140

ఆమె తననుగూర్చి అతిగర్వపడుచుండు
తాన పిలువబోదు తాను నన్ను,
నేను స్వాభిమాననిరతుడ గావున
పిలువకుండ పోను; కలియు టెట్లు? 141

ప్రణయినీ ముఖపరిభాషణమును గ్రోలి
పడిరి మత్తుజెంది పానపరులు,
మధుగృహమ్ములోన మత్తు కల్గించెడి
దేమి లేదు మచ్చుకేనిగూడ. 142

కాలమేల నన్ను కడునిర్దయత్వాన
చెరిపివేయు, భక్తవరద! నేడు?
పుడమిపలకమీద పొడమిన అధికాక్ష
రమును గాను నేను రాచివేయ. 143

అద్దమందు నిన్ను అవలోకనముసేసి
ఈర్ష్య చెందుచుంటి నేమొ, సుదతి!
నిన్నువంటి అంద మున్నవా రింకొక
రుండిరేని యెంత మండిపడెదో?

దివ్వె వెలుగగోరుదురు రాత్రి జనులెల్ల,
దానియంతట నది దగ్ధమైన నేమి
సేయజాలుదు ? రక్లై నా చింత నన్ను
చంపగా మిత్రు లేమి గావింపగలరు ? 145

వెలది ! స్వర్గము నీగృహవీథివోలె
అందచందాలతో నుండు ననుట నిజము
కాని నీవీథిలోపల కానుపించు
నంతమంది స్వర్గమ్ములోనైన లేరు. 146

త్రోవబోయెడి నూత్నపాంథుడను నేను,
పరుగులిడు ప్రతివానితో నురుకజాలు–
మార్గదర్శకు డెవ్వడో, మార్గ మేదొ
యెరుగగాలేదు నే నింతవరకుగూడ. 147

అదిగో ! తానుగూడ అనసాగినది నన్ను
'సిగ్గువిడిచా' నంచు, 'చెనటి' యనుచు;
ఇద్ది తెలిసియున్న ఇంతగా నాయిల్లు
గుల్లగుల్ల చేసికొనకపోదు. 148

ఉదర మేడిపించు, హృదయమ్ము నొప్పించు
నెంతకని రుదింతు, నేమిసేతు ?
పిలుపడినయెడల వెలయిచ్చి పిలిపించి
ఏడ్పువారల నియమించదలతు. 149

తరలి సందేశహారి ఉత్తరము తెచ్చు
వరకు వేరొక లేఖను వ్రాసియుంతు,
ఏలయన, నాకు తెలియును చాల యెట్టి
వాటి ప్రత్యుత్తరమ్మును పంపగలదొ. 150

ఆమెఉంగరాలఅలకలు వలపన్ని
నన్ను ఉచ్చుపెట్టనున్నవోయి!
దైవమా! మదీయజీవితస్వాతంత్ర్య
వైభవమ్ము భంగపడగనీకు. 151

వానచినుకుల మ్రింగగా వాగులోని
ప్రతితరంగము మొసలిదై వాయి విచ్చె.
శుక్తిలో చేరి చినుకులు మౌక్తికమ్ము
లగుట కెన్నో యాటంకము లావహించు. 152

వలను పన్నువాండ్రపై వలపూనితి
కనుక ఎగిరిపోవగలిగికూడ
వలను చిక్కినాను, బంధింపబడినాను,
బందివోలె నెంతొ కుందినాను. 153

'వలపుపిచ్చి' యనెడు పానశాలావిశా
లతనుగూర్చి ప్రశ్న లడుగబోకు,
దానితోడ పోల్చ ధారాధరపథంబు
చెత్త పారవైచు చిన్నిబుట్ట. 154

నా కెపుడో పోయినట్టి ధనమ్ము తలచి
గర్వమును చెందెడు దరిద్రు కరణిగానె
నాడె మానిన ప్రణయవ్రణములపూర్వ
రక్తిలత్వమ్ము నెంచి గర్వపడువాడ. 155

ఎన్నివిధముల సౌఖ్యము లున్నకూడ
వలపువెఱ్ఱిని తగ్గింపగలుగవయ్యొ,
పానపాత్రికై గల - నీలవర్ణ మణులు
చిఱుతపులిమచ్చలట్లు భీకరములయ్యొ. 156

సాంధ్యకాలరక్తారుణచ్ఛటల గాంచ
నీ వియోగాన కుమిలి చింతించు నాకు
పూలతోటలపై తము ముమ్మరముగ
వహ్ని కురియుట జ్ఞప్తికివచ్చె సుదతి! 157

ప్రణయినీ రాగరంజితపదయుగమ్ము
ముద్దుగొను కోర్కె తీరకపోయెగనుక
ప్రియు సమాధిసమీప ధరిత్రినిండ
చిక్క-చిక్కగా మైదాకుచెట్లు పెరిగె. 158

నాకమంటు నరకలోకమ్ము కలుపుకో
వలవ చేలనోయి, భక్తపాల!
వాంఛ కలిగినపుడు వాహ్యాళి సేయగా
మరియు కొంత-చోటు పెరుగుగాదె! 159

బాధితులకు న్యాయము కూర్చ, బాధకులకు
శిక్షవిధుపటకు శాసనరక్ష కలదు,
కాని కత్తిని పట్టకే కనులతోనె
హత్యయొనరించువాని కేలుస్తు లేదు. 160

లాగివిడిచిన బాణంబులాగు నడచు
పడతియెదలోన స్థాన మేర్పరచుకొనుము.

మునుపు పూదోటలన్నచో మురిసిపోతి,
పూలవాసన కూపిరిపోవు నేడు. 161

దరులు నడిసీరు గోరినకరణి, సాకి!
ఎంత త్యాగింతు, నంత వాంఛింతు మధువు. 162

ఆమె రానుండె నను వార్త అందె నిపుడె,
నాకు నే డింట చూపైన లేకపోయె. 163

హృదయము నపహరించి కదలిపోయిన దామె
ప్రణయరీతి ఇట్టిపాటి జేసెమొ! 164

హింస భరియించు శక్తి నార్జించె మనసు,
ఇంక నా కూర్మిరాలి వరింతు నేను. 165

రెక్కలను సాచి ఈ కోస నక్కియుంటె,
నెంత బాగు పంజరపున్ తల్పు లిపుడు విడిన! 166

వెళ్ళువరకె ద్వారము విచ్చిపెట్టరాదు,
పిలువగనె ఆమె తలుపులు విచ్చవలయు. 167

ఎడదమచ్చయె బాగున్న దింతవరకు,
అపుడు ప్రణయమె మచ్చను మించి హృద్యమయ్యె. 168

ఈ వసాంగ బాణములు వర్జించి తెపుడు?
వలపుబాకును కొలనుండి దులిపి తెపుడు? 169

దారి తెలియని ఈ మార్గదర్శి మనకు
దొరికినా డింక మన కేమి కొరత లేదు! 170

మృత్యు వేతెంచినపుడామె లేఖ వచ్చె,
చదువకయె పత్రమున నుంచి చచ్చినాను. 171

ఎవరు గాలిబుతో కలహింపవలదు,
యోగి యాత్రికుడు లోలోన, రాగి పైన. 172

దుఃఖవిషము నా ప్రాణాలు తోడివేసె,
నీవు నను చంపితి వటంచు నింద యేల? 173

విరహమే నా బ్రతుకు భంగపరచినపుడు,
మరల తాగిన వచ్చెడి కొరత యేమి! 174

పడవనెక్కింపవచ్చినవా రెరుగరు
పడవలో నాకు కలిగిన బాధలెల్ల. 175

ఒంటిగా దాటి పోగలేనోయి, గురుప!
యాత్రికుల వెంట కష్టాల ననుభవింతు. 176

'సాకి' కనులు లేవు, చషకధ్వనులు లేవు,
గోష్ఠి దిరిగె గగనగోళమెల్ల. 177

వేదనమ్ము వలన చేదైన నాల్కకు
ఆమె తీపిముద్దు లందుగాక! 178

వదలిపోయిన సఖులకై వంతవలన
గుండెనెల్ల సదా దుమ్ము కొట్టుకొనును. 179

తీరబోవని కోర్కెల భార మిట్లు
మోతు, నీయభాగ్యుని మోము గిలసేయు? 180

ఊహాలో నున్నదానికై ఉబ్బిపోదు,
మధువు నూహించి పాడెడి మధుపమట్లు. 181

ఆర్ద్రతాబంధురంబైన అలరుతోట
అలరులే రాతిగోడలై అవతరించె. 182

వేటగాని వలన్ జిక్కు పిట్ట యొకటి,
వలయె దానికి తన గూటిశాఖ తోచె. 183

ఆమె ఒరులింట దివ్వెయై అలరినంత
శోకగృహదీపమై నేను స్రుక్కినాను. 184

పూలు ముక్కోపినరుల ముఖాలవోలె
ఎఱ్ఱబడిపోవు, సంతలో కత్తియగును. 185

ప్రతియొకం డేదియో కోరువాడెగాన
వేటగాని నిందించుట వెఱ్ఱిగాదె! 186

గాజునే కోయు మద్యముకరణిగాను
గుండెనే కోయు వేదన కూడె నాకు. 187

నాశమే విశ్వమునకు పునాదియగును,
కాని వలపునకును సమగ్రత పునాది. 188

నాల్గు నిశ్వాసములు వీడి నీల్గునట్టి
నరుని అతిశయమును చూచి నవ్వె పువ్వు. 189

కాంక్షలన్నియు మృగతృష్ణికాతరంగ
ము లగుగావున యేల నిష్ఫలత కేడ్పు? 190

హృదయదీపమ్ము మలిగిపోయినదిగాన
పొగ వినీలాంబరము కట్టి పొగులజొచ్చె. 191

పికము శిశిరు నెంచె వసంతవేళలందు
కాన ప్రతిపుష్ప జ్వాలయై కాల్చదొడగ. 192

గుండియ వియోగవహ్నిలో మండిపోయె,
కాని సంయోగవాంఛను మాన లేదు. 193

ఓయి దుఃఖనిశ్వాసమా! ఈ యెడంద
కన్న చిక్కుసమస్య లోకమున లేదు. 194

వెతల మైదానమున వేరు గతియె లేదు
బాష్పవారిధారాసిక్తపథముగాక. 195

వెతల కుంటెడువాడు నవ్వినవిధాన
పైన సంతోషమును, లోన బాధ నాకు. 196

కైదులో గూడుకట్టిడి ఖగము నేను
ప్రణయరంగాన సఫలత బడయు టెట్లు! 197

ప్రకృతిసౌరుంగని ఒంటి దేవతలకన్న
నలుగురికి మేలుచేసెడి నరుడె మిన్న 198

ఆమె కనులకు రక్తదాహమ్ము కలదు,
నా కనుల నుండె రక్తాశ్రు శీకరములు. 199

నన్ను కవ్వించబోకు, నా కన్నులందు
అశ్రుఝంఝామరుత్ సమూహములు కలవు 200

మరల నలనాటి విశ్రాంతి దొరికెనేని
ప్రేయసీరమ్యమూర్తి భావించగలను. 201



అన్నిబంధాల విదలించినట్టి యెడద
కురుల ఉరులందునన్ చిక్కుకొనెను చెలియ! 202

మధువు గ్రోలి రాగిల్లెడి వధువు మోము
చూడగోర నా యిచ్చని చూపు లిపుడు. 203

గాలిబు నెరుంగ రెవరు లోకమ్మునందు?
మంచి కవియైన అతని నిందించు జగము, 204

మధువు తగినంత లేదను మాట వినిన
క్రుంగిపోయెడి నిరుపేదగుండె నాది. 205

ఆమె లాలిత్య మొసగి యేండ్లయ్యె, నింక
గోష్ఠిలో మధుదీపాలు కులికిగూడ. 206

స్వర్గమం దమృతము గూర్చి పలుకు గురువ!
నీవు కొనబోవు, మాకు నందింప లేవు. 207

చేసినట్టి పాపములకు శిక్షయున్న
పాపములు చేయనందుకు వలయు రక్ష. 208

మతగురువు నిన్ను నిందింప మథనపడకు,
అందరికిఁగూడ మంచివాఁ డగు నెవండు? 209

వత్తునని మాటనిచ్చె నా వలపురాణి,
ఎదురుచూచెద రాకపోయిననుగాని. 210

వ్రాయునపుడు సిరా యొల్కి పడినయట్లు
విరహానిశలు నా బ్రతుకున మరకలిడెను. 211

అభిమతము తీర్చుకొనుటె ధ్యేయమ్ము కాదు,
వివిధవాంఛ లోనర్చెడి వింత చూతు. 212

ఒక్క కోర్కెకై ప్రాణము లొడ్డబోవ
ఎన్నొ కోర్కెలు తీరకయున్న వింత. 213

కాంత నా నేత్రు గని భయమందు టేల?
రక్తబాష్ప మూటలువారె బ్రతుకునిండ. 214

ఎవరి కడ కేగి నావెతల్ చెవులవేతు?
నన్ను మించిన బాధల నున్నవారు. 215

ప్రణయమున చావు, బ్రతుకు సర్వమ్ము నొకటె,
ఎవరికై చావగలనొ, జీవించగలను. 216

పానశాల యేడ? భక్తుని ఇల్లేడ?
నేను వెడలుచుండ తాను వచ్చె. 217

కురులు విచ్చి గాలిచిక్కనుము, నీవిన్నను
పొడవు లెమ్మ; గర్వపడకు చెలియ! 218

విరుల తోటపైని పెనుకోర్కె తీ. ప్రైన
నిది వసంతవేళ, సగ వత్తు. 219

ఎడదగాయము నోర్వచ్చు నేని నాకు
చెలియ! నీముందు నోర్వచ్చు చేతనగును. 220

బాధ భరియించలేక బాష్పజల మొప్పి
దాన తానమాడితి, పవిత్రినను గంటి. 221

నీదు కనుచూపు కత్తిగాని ఎడంద
జొచ్చినపుడు మిత్రమునోల చూచికొంటు. 222

ప్రియకు నే గిట్టకున్నను ప్రియమె నాకు
ఆయమరయోయయారమును గన హర్షమొనపు. 223

ఎడదలోనుండి వెడలిన, వెడలకున్న
శరాలు నీ బాణనునిశితాగ్రము ప్రియమ్ము. 224

నాయెదుట పానపాత్ర యున్న యెడ నింక
యెట్టి వాగ్ధాటి వెడలునో యెఱుగనోయి! 225

నీవు నేనున్న నెంత చింతించినావో,
నీవు లేకున్న నంత చింతించినాను. 226

కుతల మిది, పిల్లవాం డ్రాడుకొనెడు చోటు
ఎవో చమత్కారములు చూతు పవలు రేలు. 227

ఆననము చూపకుండిన మానిని చాన!
ముసుగు తీసి కుపితనేత్రములను చూపు! 228

ఏదో మిషతోడ నన్నువ్వారేసి ఆమె
కడకు చేర్చిన నాయమ కరగునేమొ? 229

ఎంత దుష్టురాలవే? నిరాశాదేవి!
హృదయరాజ్ఞిని మరపింపజూతు. 230

ఎంత దగ్గర కేగిన నంత దూర
మేగు నాయమ, నా వల పిట్టి జార! 231

ఆమె కోపన, నా కథ అధికదీర్ఘ,
మద్ది వినిపింప సందేశహారుడే జడియు. 232

కరుణ గలిగియు తన పూర్వ సరణి దలచి
సిగ్గుతో తాను వెనుకకు తగ్గజొచ్చె. 233

దుఃఖవిష మింక గళమునే దూర లేదు,
నరములను జేరినపు డెంత నరకమగునో. 234

హృదయమా! ఆమెజడముడి నొదిగియుండు,
వెంత బాధ కల్గినను భరింపు మోయి! 235

ఇతరులు త్వదీయచషకము నెంగిలింప
పెదవులార నీ పిల్పు కై నెదురుచూతు. 236

ఇంతి దారికివచ్చెడిదేమొ తుదకు
నీవు తొందరపడి చనిపోవకున్న! 237

ఇంత దుఃఖమ్ము సైప నా కేకహృదయ
మేల? ఒక పది ఇవ్వవైతేమి? దేవ! 238

ఒడలు కాలిపోయె, నెడద భస్మమ్మాయె.
నింక బూది వెదకె దేల నీవు? 239

నను వదలి పోగవలె నేగె నాదు పీడ,
గుండెలో నగ్గి గలవాని గోరు నేది? 240

తరుణిదీర్ఘ కేశములు సౌందర్యఖనులు
వెలసినవి నేడు న న్నురిపెట్టుకొరకు. 241

నాకు వైఫల్యమున రుచి లేకులెత్తు,
కాన కోర్కెలు పెంచి దుఃఖాన పడుదు. 242

కలలలో నామె నాస్థితి తెలియ వచ్చు,
కనుక ప్రత్యక్షముగ నడుగంగ రాదు. 243

ఏదో అడిగెద నామె నున్మాదివోలె,
ఆమె ఉత్తరమీయ నే నాలకింప. 244

ఆమె దారిబోవుచు నాదు సేమ మడుగు,
నేమి చెప్పుదు దారిలో నింక నేను? 245

నా సమస్త మెరింగియున్నయటు లామె
మోసగించు, నింకేమి చెప్పుదును నేను? 246

నవవసంతము వచ్చి యువతినే తలపించు
పువ్వు జూచి ఆమెమోహముగ నెంచి చింతింతు. 247

'అస్తి' యని దగాచెందకుమయ్య! నీవు
వసుధపై నెంచిచూడ సర్వమ్ము 'నాస్తి' 248

పొరపెట్టుకొనుటకై స్వరతాళములు లేవు
కన్నీటిపాటలో గణయతులు కనరావు. 249

ప్రణయ మనగ అగ్గివంటిది; దంటించిన
నర్పట, దార్పినంత నారబోదు. 250

ఎంత కోమలాంగి ఇంతి, చేజిక్కియు
తాకదలచినంత తాకనీదు. 251

హృదయమా! ఆమె యెంత పిల్చినను రాదు,
రాకతప్పని స్థితి కల్గుగాక తనకు! 252

ఎంత దుఃఖించినను విమర్శించు నామె
తానిపని ఏమిచేసిన కానె కాదు. 253

చావగోరెడువానికి చావురాని
ఘోరదుర్గతి నిక చూచితీరవలయు. 254

ఎంతయిన సుందరులను ప్రేమించవలయు,
ఇటులె వారును వలచ నింకేమి వలయు? 255

మానిపోయెడి గాయము మానవలదు,
క్షతమువున కది తొలుసగుటు స్వామి! నేడ. 256

జ్వాలయే దీపమునకు సర్వస్వమట్లు
ప్రణయమే జీవితంపు సర్వస్వ మయ్యె. 257

ప్రణయ మిట్లు నన్ను భ్రష్టుజేసెనుగాని
పనికివచ్చునట్టి మనిషి నేను. 258

పీడవో, పిశాచమవో, దుర్విధివోగాని
నీవు నాదానవైతివేని అదె చాలు. 259

ఏదో అలజడి యున్న నే ఇంటిశోభ
పెండ్లిగాకున్న, దుఃఖపు వేళనైన. 260

గిన్నె నందించువారు లేకున్నయపుడు
కుండనే నోటి కానించుకొనుట మేలు. 261

స్వర్గమునుగూర్చి నాకు సర్వమ్ము తెలియు,
మనసు సంతసపడుటకు మంచి ఊహ. 262

ఆమె గనినంత నా మొగ మందగించె,
రోగి బాగయ్యె ననుకొనసాగె నామె. 263

ముద్దొసంగబోదు పొలతి, నా హృదయమ్ము
నుచితముగ గ్రహింప నూహసేయు. 264

చెప్పనిమ్ము నాదు చింతనుగూరిచి
నీకు కొంత చింత పోకునట్లు. 265

నిన్ను నిందించు జంత్రమట్లున్న నన్ను
నీవు కవ్వింతువేని ధ్వనింపగలను. 266

రాత్రిగోష్ఠిలోన రాగిల్లిన బగమ్ము
తెల్లవారగానె నల్లవారె. 267



నీదు నింపుచూపునే కోరి వేచితి,
కాంచ వేమిటొ అరకంట నన్ను! 268

విరహాగాఢాంధకారబంధుర గృహాన
మలిగిపోయిన ఒక దివ్వె కలదు నాకు. 269

ఇతరులను బాధపెట్టుట హితము కాదు,
కాన నావ్యథ శ్రోతృపఙ్క్తిన వలదు. 270

చిన్నతనమున నాకథ వినని ఆమె
యౌవనమున నాకథ లెట్టు లాలకించు? 271

ప్రణయబాధితులనుగూర్చి పలుక వశమా!
పాదములనుండి తలదాక బాధ కొలుపును. 272

గూటివద్ద వలను నాటు కిరాతుండు
ఎగురబోయి వలను తగులుకొంటి. 273

నీ పరధ్యాన మేదో ఘనిష్ఠమైన
ప్రణయరాహస్యమును బయల్పరచుచుండె. 274

మరల క్రూరశాలికొరకు నే పలవింతు
మరల బ్రతుకు దుఃఖభరిత మయ్యె. 275

గుడిని శివుడు దొరకకున్న కాశికిగాని
పరువు లెత్తి నేను బడయగలను. 276

కరుణ మెరుగనట్టి కామినీమణినుండి
కరుణ కోరుచుంటిగాదె నేను! 277

పిచ్చిహృదయమా! నీ కేమి వచ్చెనోయి!
అసలు నీ బాధ కెయ్యది ఔషధమ్ము? 278

ఎచటనుండి వచ్చె నీపూలు, ఫలములు?
కారుమబ్బు లేమి? గాడ్పు లేమి? 279

ఆమెయనిన నాకు నతిశయానురాగమ్ము,
నేనటన్న ఆమె కెంతో విసుగు. 280

దైవమా! నీవు కోరని వేవి లేవు,
లోకమున మరి ఇట్టి కల్లోల మేల? 281

మొదట నాపయి నాకె నవ్వొదవెగాని
ఇప్పు డెద్దానగూడ నవ్వేమి రాదు. 282

నాకు విధి లేక మూగినైనాను గాని
లేనిచో నేను మాటాడలేని దేది? 283

నన్ను గూర్చి వార్త నాకె అందనిచోట
నేను వాసముండినాను నేడు. 284

ఇపుడు కాశి కెట్లు లేగెద వోకసీ!
నీకు సుంత సిగ్గు లేకపోయె. 285

అన్ని బాధలు నేటితో అంతమొందె,
ఇక అకస్మాస్మరణబాధ ఒకటె మిగిలె. 286

ఇంక బ్రతుకవలసెనేని వేరువిధాన
బ్రతుకునట్టి రీతి తెల్పుకువాడ. 287

ఏది యమునింటి అగ్నిలో ఇంత వేడి?
కనపడక కాల్చు వేదనాంగార మిద్ది. 288

ఈవు తెచ్చియిత్తువేని గోజటికన్న
అధికముగనె మధువు నారగింతు. 289

కాముకుండుగూడ ప్రేమమ్ము నటియించు,
ప్రేమజీవి కింక విలువ లేదు. 290

పిచ్చివాని నన్ను వేధింతు వేలనే,
కొసరు నీవె వంతగానిద వోసి! 291

ఉవిదగోష్ఠిలో నే నుండకుంట మేలు,
నన్ను గూర్చిన ప్రస్తావనమ్మె చాలు. 292

నాకు నిష్కామకర్మ మెంతయు ప్రియమ్మె,
కాని నైరాశ్య మలమి నన్ కలతపరచు. 293

ఇంటిలో వసంతము ప్రవేశించగానె
నే నరణ్యమునం దుండినాను నేడు. 294

ఎంతో పట్టనియ ట్లుందు నింతిగూర్చి,
అయినగూడ నాదు రహస్య మరసె నామె. 295

వలపునం బడి సుందరి బక్కబడెను,
చిక్కనగొలంది హెచ్చెను చక్కదనము. 296

నా రోదనమ్ము నిన్ను చేరినంతటనె
మారిపోవునుగదే మధురగానముగ! 297

నీదు లేఖను పొంది ఆమోదపడను.
బాబు తెచ్చువానిపయి నీర్ష్యపడుకతన. 298

నీవు గోడు చెప్పినా వామె వినెగాని,
ఉత్తరమ్ము నేమి యొసగ లేదు. 299

ఇంత కష్టమ్ముగా బ్రతుకీడ్చు నాకు
దేవు డెక్కడ నున్నాడు భావమందు? 300

ఊహల పథాల పడిపోవుచున్న నాకు
మరలివచ్చెడి కోరిక మాయుగాక 301

హృదయ రాహస్య మితరుల కెట్లు తెలియు
నేను ప్రణయగీతములు రచింపకున్న? 302



నడుము బిగియించుచుంటివి నన్ను తునుమ,
నాకు తెలియులే నీ కెంత నడుముకలదో! 303

దేవి! మన పూర్వ బంధమ్ము త్రెంచబోకు,
ప్రేమ లేకున్న నుండనీ ద్వేషమేని. 304

గోష్ఠికే నేగుదెంచుట కోపమేని
కలసికొందము రమ్మి ఏకాంతముగను. 305

మెరుపువోలె బ్రతుకు పరువెత్తుచున్నను
వ్యవధి గలిగె ప్రియుని హత్యసేయు! 306

ఆమెకనులు నిశ్శబ్దమ్ములయ్యె పలుకు,
పలుకు టగ్గిని పొగయె కజ్జలము కాగ. 307

త్రవ్వి త్రవ్వి అడుగ దలచకు నా బాధ,
అగ్గి నీకుగూడ అంటగలదు. 808

జగతియంత ఊహాజాలముగనె తోచు,
కనుక నా జాలమున చిక్కుకొనకు మోయి! 809

వానరాత్రి నిన్ను వదలి యెట్టుల పుత్తు?
లెక్కబెట్ట నొక్క చుక్క లేదు. 810

ఉన్న హృదయ మొకటి—నిన్ను చూడని బాధ,
నిన్ను వినని బాధ యెన్న రెండు. 811

పాడుపడిన ఇల్లు బాగుసేయగలేను,
చెడినదాని నేమి చెరతు వింక! 812

అలిగితివి నీవయిన్ ప్రియురాల! నేను
అదియు నా వెర్రిలో నొక అంగమగును. 813

మొరబెట్టుకొన్నచో మరి బాధ హెచ్చునని
ఎరిగియుండిన నేను మొరబెట్టుకొనకుందు. 814

గగన మనెడు 'సాకి' కడ సౌఖ్యమధు వేది?
బోరగిలిన గిన్నెవోలె నుండె. 815

మబ్బులున్న రేల మరి వెన్నెలల రేల
త్రాగ విడిచిగూడ త్రాగుచుందు. 816

దుర్గమమ్ము పథము, దొంగల్ ప్రయాణికుల్,
ఇంక ఒంటిబోవుటే నయమ్ము. 817

అడుగులొత్తు మటంచు పడతి కోరినయంత
కడుసంతసమున నా కాల్జెతు లాడవు. 318

నావలెనె దుర్దినములున్న నరుడొకండు
రేయినే పగలనుకొన్న పోయెనేమి? 819

ప్రణయపరితప్తుడను, పిచ్చివాడ గాను;
విరహవేదనలో శాంతి దొరకు నెట్లు? 820

అన్ని వేదనలకు నౌషధం బుండగా
ప్రేమబాధకే లభింప దేల? 821

త్రావి రాత్రివేళ తరుణి రావలెగాని
వెంట అన్యు డెవడూ ఉండ తగదు. 822

నేను లేకపోవ నిలిచిపోవున దేమి?
ఏల నన్ను కూర్చి జాలిపడుట? 823

ఎన్నో అందాలు మట్టిలో ఇగిరిపోయె;
కొన్ని మాత్రము పూలయి కన్నువిచ్చె. 824

లోకమందు సుఖము, శోకమ్ము కల వంద్రు,
శోకమొకటె ఇచ్చె నాకు బ్రహ్మ. 825

గాయపడిన నాగుండెను శాంతు లేల?
తరుణిశరమునకే దిష్టి తగులునట్లు. 826

ఆమె సోయగంపు కెట్టిలో అడుగు దెరచె,
దైవకృత నగు నిద్ర, సాధారణమ్మొ? 827

పరుస తీపిమాటలకు లోబడెనుగాని
నోరులేని నన్నాయము చేరనీదు. 828

“నాకమున నేని నిన్ను పొందగల” నంటి,
“అచ్చరను కాను లెమ్ము నే” ననియె నామె. 329

ఎంతకాల ముంటినో ఇల నేను చెప్ప
విరహరాత్రులగూడ కల్పితిన యేని? 330

కలను కానుపించి పలికె “వత్తు” నటంచు
బ్రతుకు కదెల్ల నిద్ర పట్టలేదు. 331

చచ్చిపోవుట యేమి దుష్కరము కాదు;
సఖిరహాస్యము తెలియు నన్ జంకుతప్ప. 332

ఆశతో బ్రతుకుదు రని అనుట తప్ప
నాకు బ్రతికెడి ఆశయే లేకపోయె. 333

మూతిలేనికతన ముద్దాసంగకుగాని
నాల్క లేదె నీకు నన్ను తిట్ట? 334

నన్ను వలచినంత నిన్నొకరుల్ నిందింత్రు;
మంచివారి చెడుగ నెంచు జగము. 335

భావమందు వలపువన్నియ లిపు డేవి?
వలపులాడి ఒకతివలన వచ్చె. 336

వలపుజూదపుటింటిని వదలుకొంటి,
అచట ఒడ్డుటకై ధన మసలె లేదు. 337

నవవసంతశోభ ననుభవింపగ నీవు,
మధువు లేని గిన్నె, వ్యథితమనసు. 338

ఎట్టి అధికుడ నే, నెట్టి చిట్టనోయి !
విధి అకారణముగ శత్రుత్వమ్ము బూనె. 349

వెడలుచుంటి నిరాశను వెంటగొనుచును,
మలిగినట్టి దివ్వెను, సభన్ నిలువలేకను. 350

ఉత్తరీయాంచలము తడి నొందఁ జేసె,
నీరు తగ్గి పాపస్రవంతి యెండెను. 351

నీవు రాఁగోరితివి గాని నన్ను నిపుడ
నిక బంధించు ప్రత్యర్థి లేకపోయె. 352

తరుణిచేత చంపబడంగ తగను నేను,
చచ్చుటకు వేరె మార్గ మెంచదగు నాకు. 353

ఎన్నియో విచారములు నాకు నున్న నేమి ?
నిన్ను మఱవగాజాల నే నెన్నడేని. 354

వార్త తెచ్చినవానిని పగ గొనుటన్న,
కద్దె నా తప్పు, వాని నే మనగనెట్టు. 355

చెలియ అద్దాన మోము గాంచి చిన్నబోయె,
ఒరుల కెదనీని గర్వమ్ము తరిగిపోయె. 356

“చెడితి నీచేత” నని నింద సేయబోవ,
అందు నా అదృష్టము కొంత యలరుకొనె. 357

మెరపొకటి వచ్చి కనులలో మెరసిపోయె,
వానితో కొంత మాట్లాడ దల్చుకొంటి. 358

హంత! నను చంపరాలేదు చెంత కేల?
నీదు పొదిలోన బాణము లేదె, చెపుమ? 359

వెలదిచూపుతూపులను తప్పించుకొనగ
జూచె హృదయము, తుదకు గ్రుచ్చుకొని చచ్చె. 360

దుఃఖితుడ నేను, నా తల దునుమకున్న
వ్రాలియుండును నీకాళ్ళపైన నెపుడు. 361

ఎంత తీయని పెదవులే ఇంతి! నీవి?
తిట్టుచున్నప్పుడును గూడ తీపికురియు. 362

అపుడు గోష్ఠిలోనుండి న న్నవల త్రోసి,
రిపుడు చచ్చితి, న న్నెవ్వ డెత్తివైచు? 363

పగిలె నేని లెమ్ము పాత్ర యం, గిదె మేలు
మణికలశముకన్న మట్టిచిప్ప. 364

బ్రతుకు పరువెత్తుచుండె గుఱ్ఱమ్ము వోలె;
చేత కళ్లెమ్ము లేదు, కా లూతగొనదు. 365

నాశముందుకూడ నవసౌఖ్య మున్నది,
నఖము కత్తిరింప సుఖము కలుగు. 366

లేనియప్పుడు దేవుడ లెమ్ము నేను,
ఉన్నయప్పుడు నరుడనై యుంటి నార! 367

నాకమును పార వేయుడీ నరకమందు,
అప్పుడతిథులకయి యెవ డింక ఆశపడును? 368

ఏమి వచ్చియుంటు దౌర్భాగ్య మింతకన్న
చచ్చిపోవుద మన్నను చావు రాదు. 369

జారెడంత వస్త్రంపు దౌర్భాగ్య మారా!
విరహి తొడిగిన అంగిరైనా వలయు నలుసె. 370

మలిగిన ప్రదీపమున పొగ నాలుసినట్లు
ప్రేమ నీలిబట్టలను నా పిదప కట్టు. 371

వెతల పోద్రోలు నుంచేట స్వాగతమొసగనేల?
ఉదయ మగుదాక దివ్వె వెల్గొందవలయు. 372

చెదరి ఎవనిపై పడునో ఈ బిసరరాశి,
అతనిదె అదృష్ట, మరెవనిదే సౌభాగ్యమ్ము! 373

'గాలి బెహ్వా' అంచు కొంత ప్రశ్నించిన
నేమి ఉత్తరమ్ము నీయవలయు? 374

వీణమొట్టు గాను, విరుల నవ్వును గాను,
నా పరాజయ ప్రణాద మేను. 375

బాల్యమున నేను 'మజ్నూ'పై ప్రస్తరమ్ము
విసరబోవగ నా తల నెస స్ఫురించె. 376

ఇంకొకని నెట్టులేని ప్రేమాంధ దినాన్ను,
పాపమునకు ప్రతిఫలమ్ము బడసి తీర్పు. 377

స్వర్గమును గూర్చిన ప్రశంస చాల వింటి
కాని అది నీ నివాస మౌగాక, చెలియ! 378

హృదయ మొవరికో యిచ్చి దుఃఖింపనేల ?
ఎద నెడద లేక నాలుక యేల నోట ? 379

ఏయలంకరణము లేని సేయకగూడ
ప్రియుల మోహాపరతు వేమొ ! నీవు ? 380

ఆ యెడారిని 'మజ్నూ'గా కనుగ రెవరు,
సంకుచితు చూపువలె అది చాల ఇఱుకు. 381

చెలి కరమ్ముల తెగు వ్రాత కలదు నాకు,
తాన ప్రతి కత్తికడ వంచినాను తలను. 382

చెలియతో నాకు కలయిక కలుగనపుడు
శత్రుభావమ్ము యగు నోయి మిత్రులార ! 383

కంట నశ్రుధార కార్చుచుండుము నీవు,
ఇంకగూడ ఢిల్లి ఎంతో దవ్వు. 384

ఆరటమ్మున మనసు ప్రయత్నలోపరిచితి,
చూడ కద్దమ్ముపైన గూర్చుండినట్లు. 385

అంధకారమ్ము దౌర్భాగ్య మావరించె,
ఇంక తెలిలేక యొకటి నీక్షించనైతి. 386

నన్ను కాల్చు నీ నిశ్వాసముల వహ్ని
పరిక్కయింటిపై పడలేవ దొక్క రవ్వ. 387

అప్సరసవోని ఆమెనే వర్ణింప
శత్రువయ్యె నాదు మిత్రవరుడు. 388

నీ వెలుగుచేత సూర్యుడు నింగి మెరయు
కానిచో సూర్యు డొక బిచ్చగాని పరము. 389

కయిని శక్తి లేదు, కన్నుల బలమున్న,
దింక పానపాత్ర నెదుట నిడుము. 390

పిచ్చివలన నేమేమియో ప్రేలుచుంటి,
ఎవరి కర్థముగాక పోయెడిసిగాక! 391

క్రీస్తులాగున ప్రేమ వర్షించి వచ్చి
దుఃఖమునకు మందిచ్చు వైద్యుండు వలయు. 392

నన్ను కరుణించి పిలువు మేనాడుగాని
కాను గతమును, తిరిగి రాగలను నేను. 393

మూగవడు నెప్డొ తనువల్లకీగళమ్ము
కాన దుఃఖాశ్రుగీతమే నైన ప్రియము. 394

ఇంతిచూపు తూపులను తప్పించుకొనుట
సులభమని పరుగెత్తి నిష్ఫలుడ నైతి. 395

జానిసనె యయ్యు స్వాతంత్ర్యపరుడ నేను,
వెడలివత్తు కాశినిన్ గౌరవింపకున్న. 396

మిత్రుని రహస్య మండెను శత్రువునకు,
అయ్యది రహస్య మని గర్వ మంద తగునె! 397

మధువు తగినంత లే దను మాట వినిన
కృంగిపోయెడి నిరుపేదగుండె నాది

సఖియతో నాకు సంబంధసరణి వలయు,
కలయికలు లేనిచో వియోగమ్మె ప్రియము. 399

ఒరుల కొసగి లేదె ఉవిద! నీ అధరమ్ము?
నాకుగూడ నోరు లేకపోదు! 400

జ్ఞప్తి కేల తెచ్చినావు వాగ్దానమ్ము?
మరచిపోతి నను తరుణి తుదకు. 401

నా పిదప నావలపునకు నతు లొనర్ప
నెవఁడు లేడాయె ననుచు దుఃఖించినాను. 402

తరుణి! నీదు రమ్యాంగుళి మరతు నేని
వ్రేలినుండి గోరూడినరీతి బాధ! 403

రక్తధారలు తలపైన వ్రాలనిమ్ము
ప్రేయసీగృహసీమను వీడగలనె? 404

గ్రహములు భ్రమించెనో అహోరాత్రములును
జరుగు నేడో ఒకటి, యేల వెరగుపడగ? 405

అస్త్రదత్తుల తోచె గాయాల పూలు
వధ్యశిల కేగెదను హాసవదనమునను. 406

గోష్ఠి కేగి త్రాగకుండ రానేరాను,
త్రాగువరకు 'సాకి' రట్టుబెట్టు. 407

36. స్వాతి వాన చినుకు ముత్తెపు చిప్పలో పడి ముత్యం అవుతుంది. ఎట్టి విలువలేని నీటి చుక్కకు ముత్యం కావడం కన్న ఘనత ఏమిటి? నీటి చుక్కకు సార్థకత ముత్యం కావడమే. కాని నీటి చుక్కకు ముత్యం కన్న విలువైన ఉన్నత స్థానం ఉందంటున్నాడు గాలిబ్. అయితే ముత్యం కావాలనే కోర్కెని ఆ నీటి చుక్క వదలుకున్నప్పుడే ఆ స్థానం లభించుతుంది. అసలు ఆ స్థానం ఏమిటి? కంటిలో కన్నీటి చుక్క అగుట. కంటిలో కన్నీటి చుక్క అవడం ముత్యం అవడం కన్న గొప్ప దశయా? అవును. ముత్యం అయితే మెడలోని ఆభరణం లోనో, చెవిలోని కమ్మలలోనో స్థానం లభిస్తుంది. అశ్రు బిందువైతే నయనంలో స్థానం లభిస్తుంది. అన్ని ఇంద్రియాలలో ప్రధానమై, కాంతి మంతమైన నయన పీఠం మీద కూర్చొనే భాగ్యం ముత్యానికుందా? లేదు. ఆ స్థానం అశ్రువుకు మాత్రమే లభిస్తుంది. కనుక జలబిందువు మౌక్తికం కావడాన్ని విసర్జించి, అశ్రు రూపం ధరిస్తున్నది.

37. నక్షత్రాలు పగటి పూట ఆకాశంలో కనుపించవు. గోషా స్త్రీల వలె పరదాలలో దాక్కొని రహస్యంగా వుంటాయి. అయితే సాయంత్రం కాగానే ఏమవుతుందో ఏమో, గోషా తొలగించుకుని, వస్త్రాలు విప్పుకుని నగ్నంగా ఆకాశంలో సాక్షాత్కరిస్తాయి చుక్కలు. పగలు అంత దాపరికం గల ఈ చుక్కలకు రాత్రి ఈ దిగంబరత ఏల? చిత్రమైన జిజ్ఞాస!

46. గుండెలో ఏదో కెలుకుతోంది. ఏమిటది? వక్షస్థలంలో ఉండేది హృదయమే. హృదయమే ఇలా బాధపెడుతున్నదా? కాదు. బాణపు ఇనుప ముక్క. బాణ మెక్కడినుంచి వచ్చింది? ఆమె తనను చూచింది. ఆ చూపు, వాడి బాణం వలె వచ్చి గుండెలో గుచ్చుకున్నది. అంతలో ఆమె మోము మరల్చుకున్నది. బాణం లాగేసినట్టైంది. కాని లాగినప్పుడు ఆ బాణానికున్న ఇనుపముక్క లోపల విరిగి ఉండిపోయింది. అది మాటి మాటికీ విరిగిన ముల్లులాగా కెలుక్కు మంటున్నది. ఆమెను గూర్చిన భావన ఇనుప ముల్లికై బాధ పెడుతున్నది.

47. భ్రమరము తన ప్రేయసియైన పువ్వు కోసం దుఃఖిస్తున్నది. మొదట పువ్వు ద్వేషంతో భ్రమరాన్ని తనవద్దకు రానీకుండా మూతి బిగించుకు కూర్చున్నది. కాని భ్రమరము హృదయ విదారకంగా రోదించేసరికి వెలది వంటి పువ్వుగుండె ముక్క ముక్కలై పోయింది. భ్రమర రోదనం వృథా పోలేదు. పువ్వు గుండెను కరగించింది. వియోగ గీతాలు వృథాపోవు. ప్రేయసిని కరగించుతై.

48 ఎంత దుఃఖం వున్నా ధీరులు లెక్కచేయరు. క్షణంలో దాని [illegible] పోతారు. ఆకాశంలోని మబ్బుల దొంతరలో [illegible]

మెరుపుతో తీరలైనవారు దుఃఖదీపాన్ని వెలిగిస్తారు. ఆశలేమో మెరుపు. దుఃఖదీపాన్ని ఆశా విద్యుదగ్నితో వెలిగించుకుంటారు దీనులు. అంధకారంలో మెరుపు తీగ సహాయంతో సాగిపోతారు.

50. గమ్యం వైపు పోతున్నాడు. అది కనుచూపు మేర దూరాన కనుపిస్తున్నది. కాని ఈ యాత్రికుని దౌర్భాగ్యమేమో, గమ్యంకూడా ముందుకు నడచిపోతున్నది. యాత్రికుడు ఎంత నడచినా అది అందదు. కనిపిస్తూనే వుంటుంది. ఇతడు ఏ వేగాన నడుస్తున్నాడో ఆ వేగంతోనే అదీ ముందుకు పోతున్నది. అలాంటి గమ్యం కనుచూపు దూరాన ఉండి మాత్రం ఏమి లాభం! ఎంత నడచినా, ఎంత పరుగెత్తినా చేరలేం. ప్రేయసి కూడా స్వాధీనురాలవుతుం దనిపిస్తూనే ఉంటుంది కాని అందదు.

52. గాలిబ్ యొక్క తత్వబోధలు విని అంతా నచ్చి ఆ గృహస్థో అంటున్నాడు — "గాలిబ్! ఏమి తత్వబోధ! ఏమి తత్వచింత! ఇంత తత్వచింత కలిగికూడా తాగుతా వేమయ్యా! నీవు తాగుడు మానుకుంటే, నీ బోధలకు మేము నిన్ను యోగి అనేవాళ్ళం" అని. తాగకుండా ఉక్తులను వల్లె వటించి తత్వబోధ చేసేవాడు సులభంగా యోగి అనిపించుకోగలడు. వానిలో యోగిత్వం లేకున్నా ఫరవాలేదు. కాని నిజంగా యోగసిద్ధి గలిగి, ఉత్తముడై ఉండీ, తాగుడు అభ్యాసం ఉంటే, అతను యోగి అనిపించుకోలేడు. నటనలోనే సర్వంవుంది. నిర్మల హృదయాన్ని ఎవడూ గుర్తించడు.

59. సంతోషం అనేది ఎలా లభిస్తుంది? ఆలోచనలో అన్నీ పూల తోటలు. ఆశగా, కాంక్షలు ఫలిస్తాయనే నమ్మకం. మరి హృదయమేమో విరహాగ్నితో ఎడారిలా వుంది. మెదడు ఒక వైపు, హృదయము మరొక వైపు లాగుతున్నాయి. ఇట్టి సందిగ్ధావస్థలో సంతోషం ఎలా సాధ్యపడుతుంది?

62. బ్రతుకు ఎడారిలా వుంది. ఒంటరి తనం భయంకరంగా వుంది. ఎడారినిండా ముండ్లు. పూలు లేనే లేవు. అలాంటి ఎడారిలో పూలు పూయించడం ఎలా? గాలిబ్ ఎడారిని పూయిస్తాడు. తన ఎర్రని హృదయాన్ని ముక్కలు ముక్కలుగా చేసి ఒక్కొక్క ముక్కను ఒక్కొక్క గులాబీ పూవుగా ఆ ముండ్లకు చెక్కాడట! తాను బలియై తన ఎడారి బ్రతుకును పూయించుతాడట!

65. మత బోధకుడైన గురువు, దేవాలయం ముందర పానశాల ఉండడాన్ని సహించడు. కాని దేవాలయం ముందర పానశాల ఉండడం సహజం అంటున్నాడు గాలిబ్. పాప పుణ్యాలు, మంచి చెడ్డలు, వెలుగు నీడలు కలిసే మెలిసే వుంటాయి. కనుకనే జంటగా [illegible] కాదా

పాదాల వద్ద వుండడు. కనుబొమ్మ చూడ లేదు; కన్ను చూస్తుంది. దేవాలయం వల్ల మనో వికాసం లేదు; ధ్యానం వల్ల మనస్సు తన్మయమై క్షేత్ర ఆలోచనలను పొందుతుందట!

68. సఖిపై గల కోర్కె చచ్చిపోయిందట! కోర్కె ఎందుకు చచ్చింది? కారు చిచ్చు అంటుకుంటే అరణ్యంలో ఒక చెట్టు కాలి ఒక చెట్టు కాలకుండా ఉండదు. సమస్తం కాలి పోతుంది. అలాగే వియోగాగ్ని హృదయాన్ని పూర్తిగా దహించి వేసింది కనుక హృదయంలో ఉన్న కోర్కె కూడా కాలి పోయింది. సఖీ వియోగ దవాగ్ని సఖిపైగల కోర్కెను కూడా కాల్చి వేసేటంత దారుణమైనది.

69. తన హృదయం ఎక్కడో తప్పి పోయిందట. అది ఎక్కడ తప్పి పోయిందో తనకు తెలియదు. పోయిన హృదయం కోసం తాను వెతుకు తున్నాడు. వెతుకుతున్న వాడికి కాకుండా, ఆమెకు దొరికింది హృదయం! "నా హృదయం నీ వద్ద ఉన్నది. నేను నిన్ను ప్రేమించాను" అని వ్యంగ్యంగా చెబుతున్నాడు కవి.

75. దొంగకు దొరకకుండా పరుగెత్తినాడు. తుదకు పట్టుబడ్డాడు. ఇతన్ని పట్టుకోడానికి పరుగెత్తడం వల్ల దొంగ కాళ్ళు నొచ్చినవి. ఇతని కాళ్ళూ నొచ్చినవి. కానీ దొంగకు, దొరికిన వాడు లోకువ గనుక ఇతనితో కాళ్ళు ఒత్తించుకున్నాడు దొంగ.

85. ఆమె తన పదాలను ముద్దు పెట్టుకోడానికి కూడా ప్రియునికి అనుమతి ఇవ్వడం లేదు. "నేను ఆకాశంతో సమానమైనా కానా? నాకు నీ పాదాలు చుంబించే అనుమతి ఇవ్వవు" అంటున్నాడు. ఆకాశం ఒక విధంగా ఉన్నతమైనది. ఒక విధంగా వట్టి శూన్యం. ఆమె పాదాలను ఆకాశంలోని దేవతలు చుంబిస్తారు అని ఒక అర్థం. తన ప్రియురాలు అంత గొప్పది అని చెబుతున్నాడు. తాను ఆకాశం వలె శూన్యుణ్ణి అంటున్నాడు. ఆకాశం అనగా అవకాశాన్ని ఇచ్చేది. నిజానికి ఆకాశం అంతటా వుంటుంది. మన తలల మీద ఎత్తుగా నీలనీలంగా కనిపించేదే ఆకాశం కాదు. ఆమె పాదాల చుట్టూ ఉన్న ఖాళీ స్థలం కూడా ఆకాశమే. కనుక ఆకాశం ఆమె పాదాలను చుంబిస్తున్నది. తానూ ప్రియురా విరహ పరితాపంవలన శూన్యుడైనాడు. తనకు ఆ ప్రియురా పాద చుంబన భాగ్యం కలుగలేదు?

88. ఆమె ప్రణయస్వరూపం చూస్తే హృదయం తరుక్కుపోతుంది. అంత సౌందర్యవతి తనకు లభించనందుకు భరించరాని బాధ కలుగుతుంది. ఆ బాధ ప్రళయబాధ కన్న ఎక్కువ, అని చెప్పడానికి ఈ పద్యం రచియి

నాడు గాలిబ్. ప్రళయం ఆకారం ధరించి నిలబడితే, దాని ప్రక్కన తనను బాధించే ప్రేయసి నిలబడితే, ప్రళయమే ఒక్క నిలువెడు తక్కువ ఎత్తట! ప్రళయం కన్నా ఎక్కువ బాధ కలిగిస్తున్నది ప్రియురాలు.

99. డాక్టర్లు, వైద్యులు, హకీములు అని అనడానికి బదులు గాలిబ్ ‘‘కాగితమ్ముల మందులు కట్టువారు’’ అని అవహేళన చేస్తున్నాడు గాలిబ్ ఎందుకంటే, వాళ్లు తన విరహ రోగాన్ని తగ్గించలేరు. పైగా రోగికి జబ్బు తగ్గదని చింతిస్తున్నారట!

100. విరహ బాధ భరించరానిదిగా వుంది. రాత్రి అంధకారంలో ఆమె ముఖ చంద్రబింబాన్ని భావించుకుంటున్నాడు. పగలు సూర్యాతపం సహించలేక ఆమె కురులను భావించి వాటి చాటున దాక్కుంటున్నాడు. అయినా బాధ దుర్భరంగానే వుంది.

101. చాలా కాలానికి ప్రియురాలికి మీద ఆమెకు కనికరం కలిగింది. ఇంట్లోకి రావడానికి అనుమతి ఇచ్చింది. ఇన్నాళ్ళకు దయ కలిగినందుకు సంతోషించి అతను ఆమె ఇంట్లోకి ప్రవేశించినాడు. తన పక్కన వచ్చి పడుకున్నాడు. అంతలో ఆమె మనస్సు మారింది. ‘వెళ్ళిపో’ మని వెళ్ళగొట్టింది. అంత చంచలచిత్తురాలు. పక్క పరచుకొనే లోపల మళ్ళీ కోపం వచ్చి వెళ్ళిపొమ్మన్నదట!

102. ఆమెను ఊర్వశి అన్నాడట. అదివిని ఏమనకుండా ఊరుకుంది. ఒకవేళ ఆమె కోపగించితే, లోకులు, ఆమె కోపం సమంజసమే అంటారు. ఎందుకంటే— ఆమె ఎక్కడ? ఊర్వశి ఎక్కడ? ఊర్వశి కంటె కూడా అందగత్తె అని భావం.

105. గుండెలో గాయాలు పడి, ఆ గాయాలు మాని మచ్చలైనవి. ఆ ప్రతిమచ్చ దీపికా వృక్షానికి బీజమట! తన బాధయే తన శక్తి బీజమని గాలిబ్ భావన. తాను తన బాధను ప్రకటించినా, బాధలోనుంచే నూతన కాంతినీ, స్ఫూర్తినీ పొంది లోకాన్ని దీపికా వృక్షమయం చేస్తానంటున్నాడు ఆశావాది గాలిబ్

106 స్వర్గంలో జరా మరణ రహిత యౌవనాన్ని ప్రసాదించే కౌసరు లభిస్తుందని కొందరు భక్తుల మూఢవిశ్వాసం. ఆ మధువును పొందడానికి ఈ లోకంలో మద్యపానం చేయడం మానుకుంటారు ఆ భక్తులు. గాలిబ్ అంటాడు: ‘‘పిచ్చివాళ్ళల్లారా! కౌసరు, ఈ గాలి ఎంగిలితో కలుషితమౌతుంది. మద్యము పూల అర్కము. కనుక స్వర్గంలో దొరకనున్న ఈ గాలి

109. ప్రేమతో ఆమె కన్నీరు కారుస్తే ఆ కన్నీటిధారకు ఇతని తల తెగిందట. ఖడ్గధారకంటె పదునైన కన్నీటిధార తన తలను తెగగొట్టిందట. ఖడ్గానికీ ధారవుంటుంది, నీళ్ళకూ ధారవుంటుంది. కత్తికీ పదను వుంటుంది, కన్నులకూ పదను ఉంటుంది. పదను అనగా తడి. ఆమె ఏడిస్తే తనతల తెగినంత బాధ అవుతుంది అని భావం.

116. ఆమె కోపంతో నన్ను చంపడానికి గాను బాణం వదిలితే ఆ బాణం తాకి చనిపోవాలనే కాంక్ష నాకుంది. కనుక ఆమె శ్రమపడి గురి కుదుర్చుకో నక్కరలేకుండా నేనే యెదుట నిలుస్తాను. అప్పటికీ ఆమె బాణం తప్పిపోతే, ఆ తప్పిపోయిన బాణాన్ని తెచ్చి ఆమె కిచ్చి, మళ్ళీ గుండెకు సరిగా గురిచూచి కొట్టమని కోరతాను.

117. ఎండాకాలంలో సుదూర ప్రయాణం చేసేవాళ్ళకు కాళ్ళు కాలి బొబ్బలెక్కుతాయి. ఆ బొబ్బల నొప్పికి ఆ బాటసారులు గబగబా నడవలేరు. ఆకాశంలో చుక్కలు కూడా రాత్రియను దీర్ఘ మార్గం మీద నడిచి నడిచి, బొబ్బలెక్కిన కాళ్ళతో గబగబా నడవలేకుండా ఉన్నాయట! చుక్కలు గబగబా నడుస్తున్నట్టు కనబడవు. చాలా మెల్లగా ఈసురో మంటూ నడుస్తున్నట్టుంటాయి. రాత్రి ఎంతకూ తెగదు. విరహరాత్రి సుదీర్ఘ మార్గంలా వుంటుంది.

181. తనకు, ఆమెకు పరిణయ సంబంధమున్నట్లు ఇతరులకు తెలియగానే సిగ్గుచెంది అభిమానంతో వెళ్ళి చనిపోయిం దామె. అంత అభిమానవతి. సిగ్గుతో ఆడవాళ్ళు పరుగెత్తి పరదాలో దాక్కున్నట్టు, ఆమె మట్టిలో దాక్కున్నదట, పాపం! ఎంత అభిమానవతి!

184. సృష్టి ఆదిని 'ఆడం' స్వర్గాన్ని విడిచి నరకంలోకి వెళ్ళిన గాథలు విని బాధ పడ్డానుగాని, నేను స్వయంగా నీచే వెడల గొట్టబడి నీ ఇంట్లోంచి వెళ్ళిపోయి అనుభవించిన బాధ అంతకన్న వేయిరెట్లెక్కువ.

185. నీ కోపపు కత్తితో నన్ను నరకగల నమ్ముకొంటున్నావేమో నా విషాదగత హృదిలో అది ఒక తరంగం మాత్రమే. నీ కోపం నన్ను ఇంకేం చేయలేదు. ఇంత కన్న బాధించలేదు.

187. వసంతం వస్తే తన పాడుపడిన ఇంటినిండా గడ్డి మొలిచింది. పాడు ఇంట్లో గడ్డి మొలిస్తే పాడు పడడానికి చిహ్నం. ఇక శిశిర ఋతువులో, గడ్డినా మొలవని వసంతుడు ఇంకా ఎంత ఘోరంగా వుంటుందో!

182. పూలతోట నిండా ఆర్ద్రత ఉన్నది. అంత ఆర్ద్రమైన తోటకు ప్రాతిగోడకూడా పూలతోనే కట్టినారట! కఠినమైన వస్తువే ఆ తోటలో లేదు. ప్రణయార్ద్రమైన తన హృదయాన్ని అట్టి పూలతోటతో పోల్చుతున్నాడు కవి.

187. కొన్ని పదార్థములు సీసాలో పోస్తే, సీసా కోతపడి కరిగిపోతుంది. అంత తీక్ష్ణమైన రసాయనము లన్న మాట అవి. "సీసాలో పోయగానే సీసాను కోసే సారాయి వలె మనసును కోసే వేదన నాలో చేరింది," అంటున్నాడు.

191 దీపం మలగ్గానే పొగ చుట్టుకుంటుంది. దీపం బాగా వెలుగుతున్నప్పుడు పొగవుండదు. దీపం భర్త, పొగ భార్య. దీపం మలిగే సరికి వియోగంవలన దుఃఖిస్తూ, పొగ నల్లచీర కట్టుకున్నదట. నల్లదుస్తులు కట్టుకోడం విచార చిహ్నం. దీపం మలిగినందుకు దుఃఖిస్తూ, పొగ నల్లచీర కట్టుకున్నది!

194. లోకంలో హృదయంకన్న చిక్కు సమస్య మరొకటి లేదట!

207. గురువా! స్వర్గంలోని సుధువునుగూర్చి ప్రస్తావిస్తావు. అది నీవు పుచ్చుకోలేవు, మాకు ఇచ్చుకోలేవు. అది ఎవరికీ అందేది కాదని, ఈ లోకంలో లభించే సుధువును ఆస్వాదించక ఏల వృథాశ్రమ అని అంటున్నాడు కవి.

218. "నీవు చాలా పొడవుగా, కోలగా, అందంగా ఉన్నాననుకుంటున్నావేమో, నీ కురులను విరబోసి చూడు ప్రేయసీ! అవి నీకన్న పొడుగుగా వున్నాయి. కనుక గర్వపడకు. నీవు నీ కురులంత పొడుగైనా లేవు" అంటున్నాడు. ధ్వని ఆమె కురులు ఆమెకన్న పొడవుగా ఉన్నవి. కనుక ఆమె చాలా అందకత్తె అని అర్థం. అందకత్తెల కురులు చాలా పొడవుగా వుంటాయని ప్రాచీనుల భావన. ఇప్పటి అందకత్తెలు జుట్టు కత్తిరించుకుంటున్నారు!

222 ఆమె కనుచూపు, కత్తిలా గుండెలో గుచ్చుకుని బాధించినా ఫరవాలేదు. గుండెలోకి ప్రవేశించిన నీ చూపు, కత్తిలా బాధాకరమే అయినా దానిని మిత్రునివలె చూచుకుంటాను. హృదయంలో మిత్రునికే ప్రవేశించగలదు.

